# ప్రచండ భార్గవము

నాటకము






వెల
రూ.
1½

కృతికర్త:

మోచర్ల రామకృష్ణయ్య

# WORKS BY THE SAME AUTHOR

1. మారుతి (ఆంజనేయ స్తవము) వెల 0-6-0

   "మీ కవనము మిక్కిలి ప్రౌఢముగాను గంభీరభావ పూర్ణముగాను గనుపట్టి నాహృదయమును మిగుల నానందపరచినది"—

   'కవిశేఖర' వడ్డాది సుబ్బరాయుడుగారు.

2. రమణానంద లహరి (రమణమహర్షి స్తోత్రము) ,, 0-4-0

3. గంగా లహరి (పండితరాజ - జగన్నాధకవి కృత సంస్కృతకృతికిఁ దెనుఁగుసేఁత) ,, 0-6-0

   "మీరు పంపిన 'గంగాలహరి'ని అత్యాదరముగూడ విడువక కడముట్ట - మున్నూఱు - పద్యము పద్యము ముద్దుపెట్టుకొనుచు చదివితిని. చిన్ననాఁటనుండి నాకు గంగాలహరి ప్రియతమమయిన స్తుతి గ్రంథము. అందు పండితరాయని పరిపక్వహృదయము ప్రతిఫలించుచున్నది. ధారాళగతి, నైర్మల్యము గాంభీర్యము పవిత్రత బాహ్యాభ్యంతర కాలుష్యశోధన శక్తి ఆగంగాలహరికిఁ బోలె మీ గంగాలహరికిని గలదని మెచ్చుకొనుచుందును. పండితరాయని కవనపుమేల్మికి మీరు మెఱుఁగు గూర్చితిరి. మూలము గూడ మీరు ముద్రించి యుండవలసినది."—

   'కవిచూడామణి' వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

4. ఆత్మబోధము (శ్రీశంకరాచార్యస్వామి సంస్కృత గ్రంథమున కాంధ్రీకృతి) ,, 0-8-0

5. హంససందేశము (శ్రీమద్వేదాంత దేశికుల రచన కనువాదము) ,, 1-0-0

6. గిరిజాకల్యాణము (గద్యము) ,,

# ప్రచండ భార్గవము

(పరశురామ విజయము)





కృతికర్త:
మోచర్ల రామకృష్ణయ్య
ప్లీడరు — నెల్లూరు

# ప్రచండ భార్గవము



## నాటక పాత్రములు

### పురుషులు

సూత్రధారుఁడు.

పారిపార్శ్వకుఁడు.

పరశురాముఁడు—జమదగ్ని కడగొట్టుకొడుకు—కథానాయకుఁడు.

కుమారస్వామి—శంకరుని కుమారుఁడు.

శంకరుఁడు—కైలాసపతి.

భృంగి—శివభటుఁడు.

కార్తవీర్యార్జునుఁడు—హైహయాధీశ్వరుఁడు.

మయూరధ్వజుఁడు—కార్తవీర్యార్జునుని మహామాత్రుఁడు.

శూరసేనుఁడు, వీరవర్మ — కార్తవీర్యార్జునుని యంగరక్షకులు.

ఆక్షేపకుఁడు—వనపాలకుఁడు.

చారుఁడు.

వృద్ధకంచుకి—కార్తవీర్యార్జునుని యంతఃపురవర్తి.

జమదగ్ని—పరశురాముని తండ్రి.

రుమణ్వంతుఁడు, సుషేణుఁడు, వసువు, విశ్వావసువు — జమదగ్ని కుమారులు.

గాలవుఁడు } జమదగ్ని శిష్యులు.
శాలిహోత్రుఁడు }

## స్త్రీలు.

గౌరి—శంకరుని కుటుంబిని.

మనోరమ—కార్తవీర్యార్జునుని పట్టమహిషి.

చంద్రరేఖ—మనోరమ సఖి.

రేణుక—జమదగ్ని పత్ని.

భువనమోహిని—కార్తవీర్యార్జునుఁడు సృజించిన యొక లావణ్యవతి.

దాసి.

# INTRODUCTION

BY

**Sri Siromani**

**SANNIDHANAM SURYANARAYANA SASTRY**

*Proficient in Oriental Learning,*

*Telugu Pandit,*

Mahabub College, Secunderabad

[Author of 'Tatsama Chandrika', critical commentaries on 'Narasa-bhupaleeyam', 'Jataka Kadha Guchch am', 'Keera Sandesam', 'Vasavadatta' 'Khadga Tik kana' etc , etc ]

# ప్రచండ భార్గవము

## ఉపోద్ఘాతము

కాంతలకు లావణ్యమువలె, విద్యలకుఁ గవిత్వము ప్రాణము. కావుననే వేదవిదులును గవిత్వమునకై నిత్యమును గృతాభిలాషులగుచున్నారు[1]. శ్రుతి యీశ్వరస్తుతికై ప్రవృత్తమై, శాబ్దికునిగానో తార్కికునిగానో చెప్పక పరమేశ్వరుని 'కవి' 'కవి' యని పలుమారు ప్రశంసించినదఁట. కాఁబట్టి కవిత విద్యలకుఁ బరాకాష్ఠ[2] యనుట నిశ్చీయమానమగుచున్నది. పండితబృందమునఁ గవికి శ్రేష్ఠస్థానమిందువలన లభించినది. కవి ఋష్యంశము గలవాఁడనుట సత్యము. ఋషికల్పుఁడైనపుడే బ్రహ్మానందసహోదరమగు రసమును గావ్యమునఁ గవి నిక్షేపింపఁగలుగును. అప్పుడే కవియు ధర్మోపదేశము[3] లేక సదాచారోపదేశమానందమూలకమగును. ఈ యుపదేశము శ్రవ్యకావ్యమునందుకన్న దృశ్యకావ్యమునందు స్పష్టముగా భాసమానమగును. వినుకలిచే

---

1. ప్రాణాః కవిత్వం విద్యానాం
లావణ్యమివ యోషితాం
త్రైవిద్యవేదినోఽప్యస్మై
తతో నిత్యం కృతస్పృహాః

2. స్తోతుం ప్రవృత్తా శ్రుతిరీశ్వరం హి
న శాబ్దికం ప్రాహ న తార్కికం వా
బ్రూతే తు తావత్కవిరిత్యభీక్ష్ణం
కాష్ఠాపరా సా కవితా తతోఽనః.

3. "సదాచారోపదేశరూపనిబంధనాహి నాటకాదిగోష్ఠీవినోదా జన హితార్థమేవ మునిభి రవతారితా"—ఆనందవర్ధనుఁడు.

నొదవుదానికన్నఁ గనుకలిచేఁ గలుగు నుపదేశము శక్తిమత్తరముగదా! “దృశ్యమునందువలెఁ బదార్థములు శ్రవ్యమునఁ బ్రత్యక్షముగామి నంతగా నాస్వాద్యమానములుగావు. కావున దృశ్యకవులనే యధికముగా సమ్మానింతు”వని [1]భోజోక్తి. నాటకము సంగీతకవితాభినయముల సంపుటీకరణము. ఇందొక్కొక్కటియు బ్రహ్మానందమును గూర్చునది. మూఁడునుగూడిన నికఁ జెప్పవలయునా? కావుననే కావ్యములలో నాటకము రమ్యమనిరి. కవిచేయు ధర్మోపదేశము రూపకమందే మిక్కిలి సార్థకమగును గాన ‘నాటకాంతం కవిత్వం’ అను నానుడియుఁ గల్గినది.

రంజనా ప్రవేశాదులచేత సభ్యహృదయములను విచిత్రముగా నటింపఁజేయునది నాటకము.[2] ఇందుఁ బాత్రములు రూపింపఁబడుచున్నవి - అభినయింపఁబడుచున్నవి, యనువ్యుత్పత్తిచేత రూపకశబ్దము నాటక పర్యాయముగా నుపపన్నమైనది - రూపమే రూపకము[3]. అభినయములచే వస్తువెందు రూపింపఁబడునో యది రూపకము[4]. అనఁగాఁ దత్తద్రూపముల నారోపించుకొని యభినయించుట రూపకము[5].

నాట్యశాస్త్రము వేదమనియు నిది చతుర్వేద సారమనియు దీనిని బ్రహ్మ రచించెననియు భరతముని మతము. నాటకము చాక్షుష

1. “తత్ర (ప్రబంధేషు) నతథా పదార్థాః ప్రత్యక్షేణ ప్రతీయమానాః స్వదంతే యథా వాగ్మినాంవచోభిరావేద్యమానాః। అతః అభినయకర్తౄనేవ కవీన్ బహుమన్యామహే”
2. ‘నాటయతి విచిత్రం రంజనా ప్రవేశేన సభ్యానాం హృదయం నర్తయతీతి నాటకం’ — నాట్యదర్పణము.
3. ‘రూప్యంతే అభినీయంతే పాత్రాణి ఇతి రూపాణి నాటకాదీని, రూపమేవ రూపకం’ - నాట్యదర్పణము.
4. ‘రూప్యతేఽభినయైర్యత్ర వస్తు తద్రూపకం మతం’-దశరూపకము.
5. ‘తద్రూపారోపాత్తు రూపకం’ — సాహిత్యదర్పణము.

క్రతువని కాళిదాస మహాకవి సూక్తి[1]. ఈ క్రతువునఁ బాల్గొన్న వారికి లభించు ఫల[2] మతిమాత్ర ప్రశంసకుఁ బాత్రమై యున్నది.

సంస్కృతాలంకారికులు నాటకము సర్వాంగసుందరముగా నుండుటకై నాటకవస్తువును పంచావస్థాత్మకము (ఆరంభ యత్న ప్రాప్త్యాశా నియతాప్తి ఫలాగమములు) గా విభాగించిరి. వృక్షబీజము క్రమక్రమముగా వృద్ధినొంది యెట్లు ఫలరూపమునఁ బరిణమించునో, యట్లే నాటకకు బీజముగ నుండదగు వస్తురూపమునఁ గ్రమాభివృద్ధి నొంది తుదికి ఫలరూపమునఁ బరిణమింపవలెను. ఇట్లు వస్తువు భాసిల్లుటకై సంధిపంచకమును వానికిఁ జతుష్షష్ట్యంగములను భరతాదులు సంధానించిరి. కాని లక్షణానుసారముగా సంధులను సంధ్యంగములను లగింపవలయునన్న దృష్టితో రచనగావించిన నాటకము ససిగా నుండదన్నమాట సత్యదూరము. రసాభివ్యక్తికి సహాయపడు సాధనములను మాత్రమే కవి గ్రహింపవలెను. వేణీసంహారమున 'విలాసము' అను సంధ్యంగము శాస్త్రీయమైనను రసోచితముగా లేదని యాలంకారికులు విమర్శించిరిగదా! ఇతివృత్తమును రసానుకూలముగా మార్చుట కాలంకారికులు నిరోధించువారు గారన నిర్వివాదము. ఈ ప్రచండ భార్గవ ప్రబంధకర్తయు నితివృత్తమున నలంతి మార్పులు కావించెను.

'శృంగారో వీర ఏవ వా' అని యుండుటచే నాటకమున శృంగారవీరములలో నేదేనొక రస మంగిగాను గడమవి యంగములుగాను నుండవలెనని భరతాదుల నియమముగా సాహిత్యదర్పణకారాదులు వచించిరి. అట్టిచో ధీరోదాత్తుఁడే నాయకుఁడుగా నుండవలయును. ఇందుఁ బరశురాముఁడు ధీరోదాత్తనాయకుఁడు. ఇందలి రసము వీరము.

---

1. 'దేవానా మిద మామనంతి మునయః కాంతం క్రతుం చాక్షుషం.'
2. 'ప్రయోగం యశ్చ కుర్వీత ప్రేక్షతే చావధానవాన్
యా గతి ర్వేదవిదుషాం యా గతి ర్యజ్ఞశాలినాం,
యా గతి ర్దానశీలానాం తాం గతిం ప్రాప్నుయా న్నరః'

పరశురాముఁడు బ్రాహ్మణుఁ డగుట 'ధీరశాంతా ద్విజాదయః' అను సమయము ననుసరించి, యాతని ధీరశాంతునిగానే ప్రదర్శింప వలయుఁగదా యని యొక యాశంక పొడమవచ్చును. కాని పరశురాముని యతిక్రూరత్వము వ్యాఖ్యానించు నిమిత్త మాతఁడు ధీరోద్ధతుఁడుగా వెలయింపఁబడుటయుఁ గావనగును. నాయకుని భాష-ప్రకృతి-వేషా దులకుఁ గార్యము ననుసరించి, యెయ్యెడనైన నతిక్రమము సిద్ధించుట నాటకసామాన్య లక్షణవిరుద్ధము గాదు[1].

ధీరోద్ధతుఁడు నాటకనాయకుఁడుగా నుండవచ్చునా? అనియును నాశంకింపఁ బనిలేదు. నాటకమునకు ధీరోదాత్తుఁడే కాక ధీరలలిత ధీరోద్ధతాదులుగూడ నాయకులుగా నుండవచ్చును[2]. అట్లగుట నిందు ధీరోద్ధతుఁడు పరశురాముఁడు నాయకుఁడైనప్పుడు ప్రధానరసము వీరము గాక రౌద్రమగును. రౌద్రరస మంగియగుట పొసఁగునా యనియుఁ శంకింపరాదు. ఉత్తరరామచరితమునఁ గరుణముఁ బ్రబోధచంద్రోదయమున శాంతము నంగిత్వము వహించియుండుట సుప్రసిద్ధము[3]. ఆశ్చర్య చూడామణియం దద్భుతరస మంగియగుట సుధీజనవేద్యము[4].

1. "పరశురామస్య అతిక్రూరత్వ ఖ్యాపనాయ ధీరోద్ధతత్వ నిబంధః స "భాషాప్రకృతి వేషాదేః కార్యతః క్వాపి లంఘనం", ఇత్యప వాదాదవిరుద్ధః"—నాట్యదర్పణము.
2. "యేతు నాటకస్య నేతారం ధీరోదాత్తమేవ ప్రతిజానతే నతే మునిసమయాధ్యవగాహినః। నాటకేషు ధీరలలితాదీనా మపి నాయకానాం దర్శనాత్ కవిసమయ బాహ్యాశ్చ"
—నాట్యదర్పణము.
3. 'శృంగారో వీర ఏవవా, ఇతిసముచిత రససూచకం తేన ఉత్తర రామచరితే కరుణస్య ప్రబోధచంద్రోదయే శాంతస్యచ అంగిత్వ మవ్యాహతం' —దుర్గాదాస పండితుడు.
4. మహామహోపాధ్యాయ యస్. కుప్పుస్వామిశాస్త్రిగారి యాశ్చర్య చూడామణి పీఠిక.

తెన్నగాఁ బరిశీలించిన నిందలి పరశురాముఁడు ధీరోద్ధతుఁడు గాఁడు. అతిక్రూరత్వ మీతనియందు లేదు. ధీరోద్ధతుని గర్వము ముఖ్యము. ఈ నాటకమునఁ బరశురామునికి ధర్మమే ముఖ్యము. ధీరోదాత్తుఁడు ధర్మనిర్వహణమూలమున లోకకల్యాణము ననుసంధించును. పరశురాముఁ డట్టివాఁడు. శంకరుఁడు 'ధార్మిక కర్మదూరభూభృచ్ఛుకంఠవాలధిని కృంతనార్థము'గదా యీతనికిఁ గుఠారమొసంగెను! కావున నిందలి నాయకుఁడు ధీరోదాత్తుఁడే! వీరరసమే యంగి.

నాటకీయవస్తువును బంచావస్థాత్మకముగా విభజించి, యాయా యవస్థ సమాప్తమగుచో నాయాభాగమున [1]'అంక'మని ప్రాచీనులు పేరు పెట్టిరి. మఱియు నవసరమునుబట్టి, యానఁగా దూరాధ్వగమనము మొదలగు నేకదినాసాధ్యకార్యములఁ బ్రదర్శింపవలసివచ్చెనేని, కథా వస్తువును భేదించి చూపించుటయు నంకమే. అంకమున నొక్కదినమున జరిగిన వస్తువును బ్రదర్శించును[2]. అట్టియొక్క దినమున జరిగిన వృత్తము నొక్క యంకముననే కాక రెండు మూఁడంకములలోఁ గూడఁ జూపవచ్చును. దీనినే యిప్పటివారు రంగమందురు. రంగము, దృశ్యము అను పదములను బ్రాచీను లిప్పటి యర్థమున వ్యవహరింపలేదు. వారు 'రంగము' అను నర్థమునందును 'అంకము' అను పదమునే వ్యవహరించిరి.

భవభూతి యేకాహచరితము నేకాంకముగా నిరూపింపక భిన్న భిన్నాంకములలోఁ బ్రదర్శించెను. ఇంతేకాక యుత్తరరామచరిత్రము యొక్క చతుర్థాంకపుఁ జివరిఘట్టమున 'నిష్క్రామతి వృద్ధవర్గః' అని యారంగమును ముగించి, యాదేయాంకమున లవుఁడు వటువులతో సఖ్యమును

---

1. అవస్థాయా స్సమాప్త్యర్థ భేదో వా కార్యయోగతః
అంకస్స బిందు ర్ద్విత్ర్యాఖ్య శ్చతుర్యామో ముహూర్తతః.

2. "The events of the first two Acts occupy one day....... Thus the events of the 3rd, 4th and 5th Acts occupy one day and one night... Thus it is clear that the events of the 7th and 8th Acts must have happened on the 7th or 8th day of the dark half of jyeshta......etc.

M. R. Kale's Introduction to Malathi Madhava.

గాంచి దానిని బంధించు దృశ్యమును గవి ప్రదర్శించెను. దీనినిబట్టి, యొకే యంకమున నేకాహచరితమునే, దూరాధ్వగమనాదులు లేని విధమున భిన్నభిన్నరంగములుగాఁ జూపవచ్చునని మనమూహింపవచ్చును. కాని యిది ప్రాచీనలక్షణ విరుద్ధముగాదు. పెక్కుదినములందు జరిగిన చరితము నొక్కయంకమునఁ జూపుటమాత్రము సంప్రదాయ విరుద్ధము.

ఈ నాటక బీజమేమి? అదియెట్లు ఫలముగాఁ బరిణమించెను? ప్రథమాంక ద్వితీయరంగమున శివుఁడు పరశురాముని క్రౌంచభేదన కౌశలమునకు మెచ్చి, ధార్మిక కర్మదూరులగు నృపోద్ధత నరపాలకుల కంఠఖండనమునకు సాధనమగు కుఠారము నతనికిఁ బ్రసాదించుట బీజము. ఇది ఫలించుటకు సాహాయము పరశురాముని పితృక్రీడ. ఈ నాటక బీజము స్వీయాశ్రమోపాంతమున ప్రవేశించు పరశురాముని స్వాగతమునఁ గొలఁదిగాఁ బ్రారంభించి, గొంతుకను మొత్తుగని కొవించిన యతని ప్రతిజ్ఞతో ప్రారంభమై, మనోరమాస్వప్నసందర్శనరూపమున శాఖలుగట్టి, సేనాని కార్తవీర్యుని కంపిన జాబును గల వృత్తాంతరూపమున మొగ్గతొడిగి, మయూరధ్వజుని కదనకథనమునను గార్తవీర్యాస్త్రమునిస్సంగతోత్రరూపమునను బుష్పించి పంచమాంక చతుర్థరంగమున ఫలించినది. ఈ విధమున ధర్మనిర్వహణము చేయఁబడినది. ప్రచండ భార్గవమున నెందరో యంకములందలి రెండురంగములు నొక్కదినముననే జరిగినవి. ఆవలఁ గొలఁదికాలమునకే యనఁగా రమారమి వారముదినములలోనే ద్వితీయాంక కథయు జరిగియుండును. అది ముగిసినమఱునాఁడే తృతీయాంక కథయుఁ దదనంతరదినముననే చతుర్థాంక కథయు దాని వెంటనే పంచమాంక కథయు జరిగినది. ఈవిధముగా నీ యితివృత్తమునకుఁ బదిపన్నెండు దినములుమాత్రమే పట్టియుండును.

ఈ నాటకమున రంగములతివిస్తృతములుగాక సముచితసంగ్రథితములై రసవంతములై యున్నవి. పరశురాముని పరాక్రమ బ్రహ్మ



# ప్రచండ భార్గవము

## నాంది

శ్రీకంఠాత్త వరప్రభూత బలపారీణుఁడు రణోద్దండ ఖే
లాకుంఠా ఖరదోస్సహస్ర జయలోల ప్రాణబాణుఁడు ఘనా
నీకక్షోణి జయించుకృష్ణుఁడు సమానీతానిరుద్ధత్రిలో
కీకల్యాణకటాక్షముల్ వఱపి రక్షించుఁ మిముఁ నిత్యముఁ

(నాంద్యంతమున)

సూత్రధారుఁడు:— అతి విలంబమేల, వినియోగింపరుగదా.

సీ॥ మోచర్లకుల సముద్భూతిఁ బుట్టువుతోన
తొడరిన కవితా కుతూహలంబు
* అభినవ తిక్కనార్య భజించి, తిక్కనా
మతిఁగన్న పద్య నిర్మాణపటిమ
† శివరామయాఖ్యుచేరువ 'నాంధ్ర సభ' నట
త్వావాప్తిఁగొన్న రంగానుభవము
శ్రవ్యమ్ము మెచ్చి, దృశ్యప్రబంధపు సృష్టి
కెలయించినట్టి నెచ్చెలులప్రోది

---

* [illegible]

† నెల్లూరు ఆంధ్రసభకు నాఁటి అధ్యక్షులు శ్రీ తూములూరు శివ
రామయ్యగారు.

గీ|| కారణంబులు నుద్బోధకములుగాఁగ
'సరసకవి' రామకృష్ణుండు సంతరించె
నీ ప్రచండ భార్గవము మీ రెలమిఁ జూచి
మేలు గలదేని కొనుఁడార్యమిత్రులార !

కార్యవశమున నేనిప్పుడు హిమవన్నగవాసినయి బాలభార్గవ సమకాలికుఁడనైతిని. (అంతటఁ గలయఁజూచి) ఓహో ! యేమిది ? భక్తవశంకరుఁడగు శంకరుని యావాసముగదా యిది ! భార్గవ బాహులేయుల శస్త్రాభ్యాస కోలాహల మొక్కింతయును లేక యేల యీశైల సానుస్థలంబులు నిశ్శబ్దంబులై యున్నవి ?

[పారిపార్శ్వకుఁడు ప్రవేశించును]

పారి—భావా, యెఱుంగవా యేమి ? భృగునందనస్కందు లెన్నండో కృతహస్తులైరి. నేఁడో రేపో భార్గవుఁడు హిమగిరినుండి పయనమై తన జననీజనకులం జేరఁగలఁడు.

సూత్ర:— మారిషా, నాకొక్క సంశయము. 'కోదండ పాండిత్యమున వారిరువురిలో నెవ్వఁడధికుఁడు ?' అని.

పారి:— క్షణమాఁగుము. ఇప్పుడే నీకయ్యది స్పష్టము కాఁగలదు.

[నేపథ్యమున]

సు|| పరమేశోజ్జ్వల పాదపంకజ రజస్స్ఫూర్త్యాతిపూతంబు, శ్రీ
కర మురద్వార మహాఘ సంహరణదక్షం బిద్ధ కైలాస, మీ
గిరిమాహాత్మ్యము నాసహస్రముఖుఁడుం గీర్తింపఁగా నేరఁడీ
శ్వరు నిందుండియె కొల్చునాకిఁక బునర్జన్మంబు లేదారయన్.

సూత్ర:— (చెవియొగ్గి) భార్గవుఁడు ప్రవేశించుచున్నాఁడు. వేగిరము పోవుదము రమ్ము. కడమ పాత్రము లాయత్తమొనర్తము పద.

(నిష్క్రమింతురు)

[ఇది ప్రస్తావన.]

# ప్రచండ భార్గవము

## ప్రథమాంకము - ప్రథమ రంగము

(స్థలకము - కైలాసము)

[భార్గవుఁడు ధనుర్బాణతూణీరధారియై ప్రవేశించును]

భార్గవుఁడు:—

మ॥ పరమేశోజ్జ్వల పాదపంకజ రజస్సంస్పర్శ పూతంబు, భీ
కర దుర్వార మహాఘసంహరణదక్షం బిద్ది కైలాస, మీ
గిరి మాహాత్మ్యము నాసహస్రముఖుఁడుం గీర్తింపఁగా నేరఁడీ
శ్వరు నింపుంగని కొల్చునాకిఁకఁ బునర్జన్మంబు లేదారయన్!

పినాకపాణి యంతేవాసినై, యస్త్రశస్త్రాభ్యాసమొనర్చుచు, మయూరతురంగుని తోడనాట వినోదించుచు, శర్వాణీ చరణారవింద మరంద పానానంద తుందిలేందిందిరంబనై హిమగిరి సానువనస్థలంబుల విహరించుచు నింతకాలము సంతసంబున బుచ్చితి. నిన్నగదా యన్నీలలోహితుండు "భార్గవా, శేముషీవిశేషంబునను గోదండపాండిత్యంబునను నీవు మాననీయుండవైతివి. నీవు కోరినప్పుడు నీజననీజనకులం జేరవచ్చును. నీకు సెలవిచ్చితి" యని యానతిచ్చెను. పుణ్యనిలయమగు నీధరాధరవరేణ్యమును నే నెట్లు విడిచిపోఁగలను? పోఁగలిగినను,

ఉ॥ ఇంపుదలిర్చు నాదయిన యీ తొలిప్రాయపుఁ గౌతుకాబ్ధి పొం
గింప సుధామరీచియగు కీర్తినికాయుని గార్తికేయునిం
బెంపెసలార కూరిమికిఁ బుట్టినయిల్లగునట్టి నెచ్చెలిన్
దెంపున వీడిపోవలసెనే యని యుల్లము తల్లడిల్లెడిన్.

[చప్పుడు సేయని యడుగులతోఁ, గోదండకాండసమన్విత కర కమలుండగు కుమారస్వామి వెనుకనుండి వచ్చి భార్గవుని భుజముమీఁదఁ జేయి వేయును. అతఁ డులికిపడును.]

కుమారస్వామి:—ఏమిభార్గవా, యేమేమో నీలో నీవు మాటాడుకొను చున్నావు ?

భార్గ:—ఏమియును లేదు. మిత్రుని విడనాడవలసినదినములు వచ్చెనుగదా యని చింతించుచున్నాను.

కుమార:—సఖుఁడా, సంయోగవియోగములు సహజములుగదా ! నీయెడఁబాటు నాకును దుస్సహమే యగును. కాని నివాసములు దూరములైనను మన యంతఃకరణములు దూరములగునా ?

[శివభటుఁడు భృంగిప్రవేశము.]

భృంగి:— కుమార భృగురాములారా, మీయిరువురిని వేగిరమ వెంటఁబెట్టుకొని రమ్మని మహేశ్వరునియాజ్ఞ.

భార్గ:—సఖుఁడా, పోవుదము రమ్ము.

కుమార:—అటులే. (ముగ్గురు నిష్క్రమింతురు.)

(తెర వ్రాలును.)

——

# ప్రచండ భార్గవము

## ప్రథమాంకము - ద్వితీయ రంగము

(స్థలకము - కైలాసము)

[గౌరీశంకరు లుపవిష్టులైయుందురు]

గౌరి:— మీ రన్నమాట నే నంగీకరింపఁజాలను. కుమారునికన్న భార్గవుఁడే ధనుర్విద్యయం దధిక నైపుణ్యమును గడించెనన్న మీ మాట విశ్వసింపఁజాలను.

శంకరుఁడు:— ప్రత్యక్షముగ నిరూపించిన నీ వంగీకరింతువా?

గౌరి:— విధిలేదు. మనప్రోల వారి శస్త్రవిద్యాపాటవము ప్రదర్శింపఁబడినచో నప్పుడు మన వాదములయందలి సత్యాసత్యములు బలాబలములు స్పష్టమగును.

శంకరుఁడు:— నిస్సందేహముగ - త్వరపడకుము.

[భృంగి భార్గవ కార్తికేయులు ప్రవేశింతురు. భార్గవ కార్తికేయులు గౌరీశంకరులకు నమస్కరింతురు.]

శంకరుఁడు:— చిరంజీవులారా, మీ శరాభ్యాస పాటవముం బరీక్షింప మాకు మనసు పుట్టినది. మీమీ ధనుర్విద్యాకౌశలముం బ్రకటించి, యల్లదే యా క్రౌంచము నొక్క బాణముతో నొక వైపు నుండి యావ్వలిప్రక్కకు రంధ్రముగావింపవలయు. ఉపక్రమించి నాయాదేశము నిర్వర్తింపుఁడు.

భార్గవ కార్తికేయులు:— మహాప్రసాదము (ఇరువురు నిష్క్రమింతురు)

గౌరి:— ఇట్టియాజ్ఞ యొనర్తురని నేఁ దలంపలేదు.

శంకరుఁడు:— ఎట్టి పరీక్ష యుచితమని యూహించితివి?

గౌరి:— పాండవమధ్యముని భండన పాండితిం బరీక్షింప నలనాఁడు మీరు సంఘటించిన విధానముంబోలిన పన్నుగడ యొకటి పన్ను దురని భావించితిని.

శంకరుఁడు:— క్రౌంచభేదన పరీక్షయే మేలు. ప్రాణప్రియా, యిదే నామాట వెంబడిప లక్ష్యవేధన మారంభింపఁబడినది.

గౌరి:— చూచుచున్నాను. అదిగో!

గీ॥ శరము కార్ముకమున సంధించెను కుమారు
సుప్రయోగ విశిఖుఁ జూడుఁ డదిగో,
చెదలరేఁగు సురల జయ జయ ధ్వనులలో
వాని బాణరవము లీనమయ్యె!

శంకరుఁడు:-[చిఱునగవుతో] (స్వగతము) పుత్త్రప్రేమప్రభావ మిట్టిదే కాఁబోలు (ప్రకాశము) ప్రేయసీ, చూడుము, కుమారుని నారా చము నగమును భేదించునన్న నమ్మకము కలుగుటలేదు. జాగ రూకతతో మఱియొక బాణము నాతఁడు ప్రయోగింపవలసిన ట్లున్నది.

గౌరి:-—తొలిప్రేటు తప్పిపోయినఁ బోవును గాక. రెండవబాణమైన భేదింపకుండునందురా?

శంకరుఁడు:—రెండవది దూసిపోయిన, మూఁడవదానిని సైతము ప్రయో గింపవలసివచ్చునేమో!

గౌరి:—బాలకులపట్ల నంతమాత్రము చేసవునూపఁదగదా?

శంకరుఁడు:—ఏకబాణప్రయోగముచేత నే క్రౌంచము నరంధ్రము గావింపవలయునని మొదట నేనాడితినిగదా! ఇప్పుడది సవ రించు టెట్లు పొసంగును?

గౌరి:—(ఉద్వేగముతో) అయిన మనకుమారుఁడోడిపోయినట్లేనా?

శంకరుఁడు:—భృగురాముఁడు గెలిచినఁగదా?

గౌరి:—అతఁడును క్రౌంచభేదనము చేయఁజాలనిచో?

శంకరుఁడు:—ఇరువురును తుల్యప్రజ్ఞులని యేర్పడును.

గౌరి:—అట్లయిన సంతోషమే!

శంక:—ప్రియా, తిలకింపుము. భార్గవుఁ డుపక్రమించుచున్నాఁడు. అతని శరసంధానముం గనుము.

క॥ పంచాస్యమధ్య. యల్లుఁడు
కాంచుమిదె భృగుసుతాను శరాగతి కిపు డహో
క్రౌంచమును కంపించెనో, భే
దించునో యేమో యతండు దీని శరాసనా!

గౌరి:—ఏమో!

శంక:—చూడుము, మెఱుపు మెఱసినట్లు భార్గవబాణము మహావేగమునం బోవుచున్నది.

గౌరి:—(తదేక దృష్టితో) క్రౌంచముం దాఁకినది. ఆహా! యదృశ్యమైనది. (చప్పటలు జేఱచి) భేదించినది. అటువైపునుండి వెడలివచ్చినది. ఔరా, యేమి! భృగురాముని శస్త్రప్రయోగకౌశల మద్భుతముగానున్నదిగదా! (విభ్రాంతయై చూచును)

శంక:—కంటివా యీయబ్బురము! ఈ క్రౌంచమును భృగురాముఁడును నేకబాణ ప్రయోగమున రంధ్రముగావింపఁ జాలఁడని తలంచితిని.

గౌరి:—చాలుచాలు మీ చతురవాక్యలు. చిత్రచర్యానిధులన్న మీరే! మీ సంఘటనముల యంతరార్థములు నాకే గోచరింప నీయకున్నారే, యౌరా! మీ మాయలమారి చెయ్వులు మానవమాత్రుల కర్థమగునా?

శంకరుఁడు:—కల్యాణీ, యేటికి నీకీయలుక? కుమారుఁ డోడిపోవునని నేను మాత్రము తలంచితినా?

[భార్గవరామ కుమారస్వాములు ప్రవేశింతురు - శంకరుఁడు లేచి భార్గవుని గాఢాలింగన మొనరించుకొని చుబుకముం దడవుచుఁ జేరువం జేర్చుకొనును. కుమారుని గౌరి చేరంజీరి యనునయించును. కుమార స్వామి తల్లిని వీడివచ్చి తన కరమున భార్గవుని కరముం జేర్చును].

కుమారస్వామి:— నా సతీర్థ్యుఁడు కూర్మిసఖుఁడు భృగురాముఁడు నేఁటి పరీక్షలో విజయలక్ష్మిం జేపట్టెను. ఈ వీరకుమారుని సముచిత లీల మీరు సమ్మానింపవలయు.

[భార్గవుఁడు గౌరికిఁ బ్రణమిల్లును. గౌరి యాతని లేవఁదీయును.]

గౌరి:— మేలు మేలు భృగురామా, నీ లక్ష్యశుద్ధి యనన్యసాధ్యము. నీ బాహుబల మప్రతిద్వంద్వము. చిరంజీవివై వర్ధిల్లుము.

సీ। ఒక్క నారాచనఖముతో నురవణించి,
క్రౌంచ కుంభీంద్ర కుంభంబు చించిచీల్చి,
యంచె ముత్తెమ్ములను వెల్వరించి నట్టి
హరివిగాని, మనుష్యుండవా? కుమార!

శంకరుఁడు:— సంతసించితిని భృగురామా, నీ ధనుర్వేద విద్యావైశద్యమునకు నాయకీనందనము. నీకు బహుమాన పురస్సరముగా నేఁడీ పరశువు నొసంగుచున్నాను.

ఉ। ఇచ్చితినోయి భార్గవ, గ్రహింపుము-ధార్మిక కర్మదూర భూ
భృచ్ఛయకంఠనాళవినికృంతనసారము నీ కుఠారముౕ,
సచ్చరితుండవై గుణవిశాలుఁడవై పితృవాక్యభక్తిని
ర్యచ్ఛిరకీర్తివై పరశురాముఁడవై మనుమయ్య దీనిచేౕ!

గౌరి:— నాయనా నీ చరిత్రము విచిత్రము.

గీ॥ ఖండపరశువు కూర్మి శిష్యుండ నైతి
నా మహాత్ముని సాన్నిధ్య మందు దక్షుం డ
నైన కోదండపాండిత్య గుణులవాఁడ
పరశురాముఁడ నైతి నబ్బురము నన్న!

శంక:— ఇదే శుభముహూర్తము — పయనమై నీజననీజనకులం జేరుము. వారు నీరాకకై నిరీక్షించుచుందురు.

పరశురాముఁడు:— మహాప్రసాదము.

(కుమారస్వామి నుద్దేశించి) దయాస్వా, నేఁబోయివత్తును. నిను విడిపోవ కాళ్ళాడకున్నవి. నను మఱవవుగదా! క్రౌంచభేదనపరీక్ష మాత్రము మఱచిపొమ్ము. లోకగురునానతి యనుల్లంఘ్యమగుట వంకుల కీనుకొంటినిగాని కానిచో నేనట్టిపరీక్షకు నీతో నా పోటికి నిల్చుట?

కుమారస్వామి:— పరశురామా, ఇంతమాత్రము నీవోర్చుకొనవలయునా? దానినప్పుడే మఱచిపోయితిని పొమ్ము. నీకు శుభమగుఁగాక.

(తెర వ్రాలును.)

# ప్రచండ భార్గవము

## ద్వితీయాంకము _ ప్రథమ రంగము

### స్థలకము - మాహిష్మతీ నగరము - ప్రమదావనము

[మనోరమా చంద్రరేఖలు ప్రవేశము]

మనోరమ:— చంద్రరేఖా, మొన్న మొన్న మనము వింధ్యాచలము సమీపమున కరిగినప్పుడు కాంచిన వనము దాని రామణీయకము నా కిప్పటికిని మఱపురాకున్నది.

చంద్రరేఖ:— వనరామణీయక విలోకనము, నర్మదా నిర్మల జలక్రీడా వినోదము - వీనితోపాటు పదితలల రక్కసునితోఁ బోసంగిన సమర కోలాహలమువలని భయము జ్ఞప్తికి వచ్చుటలేదా? బాల్యమున నీవు ధనుర్విద్య నభ్యసించినదానవే, యానాఁ డేల బేలవై భీతినొందితివి ?

మనోరమ :— ఇఱువదిచేతుల రాకాసిమన్నినితోఁ బోరుసల్పుటకు వేయిచేతుల ఱేఁడుండఁగా మనకేమి భయమని యనుకొంటినిగాని హృదయము నెంత చిక్కఁబట్టినను నా కిప్పటికిని బెదరు వదలినది కాదే! అది తలంచుకొనిన గుండియలు జల్లుమనుచున్నవి, చంద్రరేఖా,

మ॥ క్షయకాలోగ్ర నిటాలలోచనశిఖాకల్పస్ఫుర చ్ఛౌర్య దు
ర్జయులై, యూర్జితసింహ గర్జనలతోఁ గ్రవ్యాదనాథుండు హై
హయవంశాగ్రణియుఁ బరస్పరజిగీషాయత్త చేతస్కులై
భయదాయోధన కేళిసల్పుట తలంపన్ మేను కంపించెడిన్.

చెలీ, రమ్ము నా యురమ్మెట్లు కొట్టుకొనుచున్నదో చూడుము.

చంద్రరేఖ:— (మనోరమ యురము స్పృశించి) అవునే, యీస్పందనము నాపై నిన్ను నిస్తంద్రం జేయుచుండెను నీ మనోహరుండు వేయి చేతులతో నిన్నాశ్లేషింప వలసినట్లున్నదే.

మనోరమ:— చాలు పోవే నీ పరిహాసము.

చంద్రరేఖ:— పరిహాసమా, యాణిమాదిసిద్ధుల నార్జించిన నీవిభుండు తన యిచ్ఛవచ్చిన సమయములందు మాత్రమే వేయిచేతులను వెల్వఱచుచుండఁబట్టి సరిపోయె, లేకున్న నీవు నీమనోహరుని జూచినను భయభ్రాంతవై పరుగెత్తియుందువేమో!

(‘చంద్రరేఖా!’ యని నేపథ్యమున ధ్వని)

ఎవరో పిల్చుచున్నారు. నేఁబోయివత్తును.

మనోరమ:— పోయిరమ్ము.

(చంద్రరేఖ నిష్క్రమించును. మనోరమ పాటపాడుకొనుచు లతానికుంజములవంకకుఁ బరిక్రమించును. పొదరింట్లలో నేమో వెదకుచు నాక్షేపకుఁడను వనపాలకుఁడు ప్రవేశించును.)

మనోరమ:— ఏమోయీ, తోట్రుపాటులో నేమో వెదకుచున్నావు?

ఆక్షేపకుఁడు:— పెంపుడు గోరువంక యొకటి తప్పించుకొని పాఱి పోయినది తల్లీ.

మనోరమ:— ఏల? ఏమి జరిగినది? ఏ గోరువంక?

ఆక్షేపకుఁడు:— ప్రొద్దునఁ బెంపుడుపులుఁగుల గూళ్ళు బాగుచేసితిని. పరిశుభ్రపఱచుటకై పావుగడియక్రిందట మాలతీమండపములోని పైఁడిపంజరము తలుపుతీసితిని.

మనోరమ:— అవును. అందు విశేష మేమున్నది? అనుదినమును నీవు చేయుపనియేకదా యది?

ఆక్షేపకుఁడు:— వినుము తల్లీ, తలుపుతీయుటగే తడవుగా నందున్న చిలుక—గోరువంక, యివి రెండును వెలికివచ్చినవి. జంటబాయ

నివిగ దాఱువి ? విడివడినవి. చిలుక మండపముమీఁది కెగిరినది. గోర్వంక యెలమావిచెట్టుపై వ్రాలినది.

మనోరమ:—ఆ! ఆ! అంతట ?

ఆక్షేపకుఁడు:— నేను పంజరము బాగుచేసి, సళ్ళిన పూలపందిళ్లు చక్కఁ బఱచుచుంటిని. అమ్మా, యింతలో నెచ్చటినుండివచ్చెనో, యావాయిచుక్కవలె తెల్లని నొక సాళువము మూఁకి, చిలుక నాడిసి, తన్నుకొని మింటి కెగసిపోయెను.

మనోరమ:—అయ్యో, అయ్యో, యెంత దురంతము! శారిక యేమయ్యెను?

ఆక్షేపకుఁడు:—గోరువంక యవస్థ నేనేమని వర్ణింపఁగలను? మండలాకారముగా మండపము నాల్గువైపులఁ దిరిగితిరిగి, పలవరించి, యూడిపోవునట్లు ఱెక్కలల్లార్చి, లోనికేగి, మరలివచ్చి, తల క్రిందై, విసివి, వేసారి, యేడ్చి, నిలువఁజాలక, బుఱ్ఱున నెట్లో యెగిరిపోయినది. ఎచ్చట వెదకినను గానరాలేదు దేవి

మనోరమ:— ఎంత యన్యాయము !

ఆక్షేపకుఁడు:— ఇట్టి విపర్యాసము మిప్పటికి జరుగలేదు తల్లీ !

మనోరమ:— పొమ్ము, వనము నల్దెసలనుగాలించి చూడుము.

ఆక్షేపకుఁడు:—చిత్తము - నాశక్తి వంచనచేయక వెదకెదను.

(నిష్క్రమించును)

మనోరమ:—ఔరా, యీ వృత్తాంతము నాయంతరంగము నెంత కలఁత నొందించినది !

(సేవకుఁడు ప్రవేశించును)

సేవకుఁడు:—అమ్మా, చక్రవర్తిగారు దయచేయుచున్నారు. (సేవకుఁడు నిష్క్రమించును)

(కార్తవీర్యార్జునుఁడు ప్రవేశము)

మనోరమ:— ఆర్యపుత్త్రునికి జయమగుఁగాక ! ఎచ్చటికో ప్రయాణోన్ముఖులైనట్లున్నది ?

కార్త:— వేటకై యరణ్యమునకేగు సన్నాహమున నున్నాను.
మనో:— నేనును మీతో వచ్చి, వనదృశ్యములతో పాటు మీ మృగయా
వినోదమును దిలకింపవలయునని కుతూహలపడుచున్నాను.
కార్త:— ఈనాఁడు నీవెట్టి యపూర్వపుఁ గోరికం గోరితివి ?

సీ॥ రత్నకుట్టిమసు విహారస్థలుల్ లేవట
కర్కశ కంటక మార్గములె కాని,
రమణీయ కేళికురంగముల్ లేవట
దారుణ వన్యసత్త్వములె కాని,
కర్పూర మణిదీపికా ద్యుతుల్ లేవట
గహనాగ్ని విస్ఫులింగములె కాని,
తతహంసతూలికా తల్పముల్ లేవట
శ్రమముగొల్పు గండోపలములె కాని,
గీ॥ భీకర క్ష్వేళ దుష్టసర్వ కరముల
బహుళ ఘూత్కారములె కాని, వరవిపంచి
కా రవాంచిత గీతాదికములు లేవు
చాన, నీవేల, విపిన సంచార మేడ !

మనోరమ:— మనోరమణా, మీతోడి విపినసంచారమైనను హృద
యంగమమై యుండును. ఇంక మీయెడఁబాటు నొక్క దిన
మేనియు సహింపఁజాలను. నేను మీతో వత్తును. అనుగ్రహించి
యనుమతింపవలయు.
కార్త:— చేలా, యిదియేటి మాట ? ఎంత వెఱ్ఱిదానవు. ఒకటి రెండు
దినముల యెడఁబాటునే సహింపలేవా ?

గీ॥ ధవుని ధనమైన క్షత్రియోత్తమకు నీకు
వీరపత్నికి వెఱపుగల్పించు నొక్కొ,

కాలగతిఁ గల్గు విప్రయోగమ్ములైన,
రణములైనఁ దదీయమారణములైన ?

మనోరమ:— అమంగళము శాంతించును గాక ! అయ్యో,

గీ॥ అశనిపాతమ్ములుగ నిట్టి యశుభవాక్య
లడరె మీనోట - విధి యలంఘ్యము నిజమ్మొ,
యైన, నస్తంగమించు సహస్రకరుని
ననుగమించునేట ఛాయ కాయాస మగునె ?

కార్త:— క్షత్రియ పత్నుల చిత్తస్థైర్యమును నీజ్ఞప్తి కలయించుటకై నేనూఱక మాటవరుస కంటిఁగాని, యింతలో నీవి ట్లుమ్మలింపఁదగునా ? వేటకై పోవు నేను రేపే మరలిరానా, యలివేణీ! నీవావంత యేని వంతకుఁ దావీయవలదు పోయివత్తును.

మనోరమ:— పోగు సేయుదు రేమో, మీ రేమన్నను వనస్థలీ సహజ సౌందర్యము లెంత చూచినను దనివి తీఱునవి కావు.

గీ॥ శబరసారంగ దృగ్విలాసములు, శాంత
ముని జనాశ్రమ సుమనోవిభూతి కలిత
సురభిసౌభాగ్యములు మనోహరము లచటి
దృశ్యములు మిమ్ము కదలిరానీయఁగలవె ?

కార్త:— చేలా, యేల యీ మాటలు ?

సీ॥ అరవిందగంధి, నీ యనుభూతిగల నాకు
వనసూన సురభి సంభార మేల ?
హరిణాక్షి, నీ యపాంగాద్భృతి గల నాకుఁ
గాంతార మృగ విలోకనము లేల ?

వనిత, నీప్రణయ విభ్రమ రేఖగల నాకు
శబరాంగనా విలాసమ్ములేల ?
వెలఁది, నీ శృంగార విభవమ్ముగల నాకు
మునిజనాశ్రమ శుచి స్ఫూర్తిగోల ?
గీ: నా మనోరమ యుంపించు నేమిగోరి
యా వనీరమ చింత నే నాలసింతు ?
నాకు నీకన్న రసేచనకము గలదె,
సంశయంబో[illegible] చెగ రానే, ల[illegible]గి!

(ఇరువురు నిష్క్రమింతురు. తెర వ్రాలును)

---

# ప్రచండ భార్గవము

## ద్వితీయాంకము – ద్వితీయ రంగము

### (స్థలకము – జమదగ్ని యాశ్రమము)

(గోదేవతాస్తుతి రూపకమగు గేయముం బాడుచుఁ, బసుపు కుంకుమల యాలంకారములతో హోమధేనువును సింగారించుచు, గంధాక్షతలతోఁ బూజించుచు రేణుక ప్రవేశము – రెండు గేయపాదము లామె పాడిన పిమ్మట రుమణ్వంతుఁడొక పచ్చికమోపుం గొనివచ్చి దాని ముందుంచును. సుషేణుఁడొక పాత్రమున జలముం గొనివచ్చి దానిచెంతం బెట్టును. వసు విశ్వావసు లడవి మల్లియ పూదండలం దెత్తురు. ఒక హారమున వసువు దాని కంఠము నలంకరించును. విశ్వావసువు మఱియొక హారమును దాని శృంగములం గీలించును. నలువురు కుమారులును రేణుకయు గేయము నైకకంఠ్యముగాఁ బాడుచుందురు. నిశ్శబ్దముగా జమదగ్ని మహర్షి ప్రవేశించి యానందముతోఁ జూచుచుండి గేయము పూర్తియైన పిమ్మట ధేనువును సమీపించును).

జమదగ్ని:— అమ్మా, గోదేవతా,

మ॥ చివురుం జేవురు మేనిసోయగముఁ, గించిద్వేల్లితస్ఫూర్తితో
నవదాతద్యుతులీను నెన్నొసటి రోమాంకంబుతో, వెల్గు
నీవపురా, క్రొన్నెల రేకఁ దాలిచిన సంధ్యాదేవివే తల్లి, నీ
కివిగో నేనొనరింతుఁ గైకొనుము మాహేయీ! నమ
స్కారముల్

[అందఱును ప్రదక్షిణము చేయుదురు. తెర వ్రాలును.]

——

# ప్రచండ భార్గవము

## ద్వితీయాంకము - తృతీయరంగము

(స్థలకము - అరణ్యము: కార్తవీర్యార్జునుఁడు మయూరధ్వజుఁడు ప్రవేశము)

కార్తవీర్యార్జునుఁడు:— ఇప్పగిది మనము మాహిష్మతీ ప్రాంత రాష్ట్రపు సరిహద్దులు దాటి వచ్చినను మిన్నెన్నంతయు గని గని మాయుంగని మనోజ్ఞంబగు వనాంతరముం జొచ్చితిమి సఖా!

సీ॥ శ్రుతి పుటంబుల గీతికామృతాయముఁ గురియు
కొమ్మలను జారుచున్న శుక తతులు,
బెడిదమగు వేట వేసట సడలఁగొనఁగ
మెల్ల మెల్లన గమ్మ సమ్మీరలు వీచె.

మయూరధ్వజుఁడు:— నిజమే, యిచ్చోటి వనస్థలి దేవతలు నూత్నాగతు లగు సార్వభౌములకు మీకు శుకపికధ్వనులతో స్వాగత మొసంగి, తియ్య పద్యావళితో కానుకలు కొనుచున్నారు ప్రభూ!

కార్త:— వయస్యా, నిజము. ఈ విపినోపాంత మాశ్చర్యముల కాలవాలముగా నున్నది.

మ॥ ఇదిగో నాయక! పోదవైపు చూడఁగదవో
యిదా, పోయి పాలిచ్చుచు
న్నది మువ్వన్నె మెకమ్ము, దానికడ వ
త్సాసక్తితోఁ ద్రావుచు
న్నది లేఁబ్రాయపు లేడి - చిత్రమిది, చెం
తన్ బబ్బ్యా మున్యాశ్రమం
బెదిరింపుం డవలెన్నిడేంబు : కతమూ
హింపంగ వేఱున్నదే!

జమదగ్ని:— అభీష్టావాప్తిరస్తు (కార్తవీర్యు నుద్దేశించి) వత్సా, యీ దర్భాసనమున నాసీనుఁడవు గమ్ము...... (కార్తవీర్యుఁడాసీనుఁడగును. అంచుక దూరమున నా యూర్ధ్వజుఁడును గూర్చుండును)

మ॥ అవనీపాలకులాగ్రగణ్యా! గురు దత్తాత్రేయదత్తప్రశ
స్తవరప్రాప్తమహాప్రభావుఁడవు - చంచద్బాహుశాఖా సహ
స్రవిరాజన్నోగ్ర విపక్షకోటివని విభ్రాజిల్లు నీకీర్తి నా
చెవికిన్ వచ్చెను మున్నె - నేఁడు నిను వీక్షింపఁగాఁ గల్గెన్ జమీ!

అహాహా యహా నీకుఁ గార్తవీర్య చక్రవర్తీ!

మ॥ నిరమిత్రం బగు నీదు రాష్ట్రము సిరిన్
పెంపొందునే? నీ ప్రజల్
సరియుండ్రే యుపదిష్టులై శ్రుతిహితా
చారంబు? యజ్ఞంబులన్
ధరణీదేవు లొనర్తురే? వసుధ నా
నాసస్య సంపత్సుఖా
కరమై వెల్గునె? ధేను సంతతికి సౌ
ఖ్యంబే ధరావల్లభా!

కార్త:— త్రికాలవేదులు తమ కెఱుంగని దేమున్నది? మాకు సర్వమును సంపన్నమగుటకుఁ దమవంటి సంయమీశ్వరుల తపోమాహాత్మ్యమే కారణము కాని వేఱుకాదు.

జమ:— రాజమౌళీ! నీవును నీ మహామాత్రుఁడును వేఁటకతమునఁ గడు బడలియున్నారు. నా యాశ్రమమున మీరించుక విశ్రమించి మా యాతిథ్యము గ్రహింపవలయును.

కార్త:— మహా ప్రసాదము.

[ముువ్వురును నిష్క్రమింతురు - తెరవ్రాలును.]

# ప్రచండ భార్గవము

## ద్వితీయాంకము - పంచమరంగము

[స్థలకము - జమదగ్నిమున్యాశ్రమోపాంతము - పరశురాముఁడు ధనుర్బాణతూణీరకుఠారధారియై ప్రవేశించును.]

పరశు:— ఇది మాయాశ్రమోపాంతముగదా, ఈ వనప్రాంతమంతయు నాకుఁ జిరపరిచితమయ్యు నేఁడెంతో నవీనముగా నదృష్టపూర్వముగా నున్నది.

సీ॥ దట్టంపుఁ బొదరిండ్లపట్టుల, మవ్వంపు
దివ్వెలో యనఁబొల్చు దీప్తమణులు —
మణులఁగప్పొని, కుసుమభ్రాంతి, మకరంద
రసకాంక్ష ఝుమ్మని ముసరుఁ దేంట్లు —
తేంట్లమొత్తమ్ములై తీవెలపైఁ గ్రమ్మ
నలరుగుత్తులనుండి జాలుఁగాఁ దేనె —
తేనె బిందులు చింది తీరికాల్వలుగట్టి
సెలయేటి సోనలఁ గలియుచోట —

గీ। పళ్ళ-దరులందుఁ బచ్చికబీళ్ళ-సలువుఁ
గనులకు ముదంబు పచ్చఱాగనులలీల,
నస్వాహంబును దర్శనీయంబు ప్రకృతి —
యహార, వనలక్ష్మి సౌభాగ్య మద్భుతంబు!

(పరిక్రమించి) ఏమి యీ దృశ్యము! అల్లదే యా సింగపుఁ గొదమ సరస్తీరమున దప్పితీర్చుకొనుచున్న మత్తేభయూథముమీఁదికి దూఁకు

చున్నది. మెఱపుమెఱసిన క్లింతలో కరిగినది! ఓహో, పంచాననముం గాంచి కరిసంచయము పరువెత్తిపోవుచున్నదే! శౌర్యములేని దేహబల మెంతయుండి యేమి ప్రయోజనము?

ఐనను క్రూరసత్వములును మాతండ్రి తపఃప్రభావమున జాతివైర ముడిగి సౌహార్దమున నుండవలసిన యీ యాశ్రమోపాంతము గదా యిది? ఏల యవి యిట్లు విరుద్ధాచరణమునకుం బాల్పడినవి? మాతండ్రి తపస్సు క్రోధాగ్నులచే నీఱైన నేఁడు కుంఠీభూతమైనదా? మా వేల్పుటావు తన ప్రభావము దిగనాడినదా యేమి? లేక విషయవ్యాసక్తుఁడను నెవ్వనికేని రాకచే మాయాశ్రమము మలీమసమైనదా?

(రెండుమూఁడడుగులు నడచి) సూర్యభగవానుని కిరణప్రసారముచే నీకాసార మెంత రమణీయముగా నున్నది! ప్రతితరంగమునందును సూర్యప్రతిబింబమే! జీవులందఱును బరమేశ్వరుని ప్రతిబింబములే!...

[నిష్క్రమించును. తెరవ్రాలును]

# ప్రచండ భార్గవము

## (ద్వితీయాంకము - షష్ఠ రంగము)

[స్థలము - జమదగ్న్యాశ్రమ సమీపము. శూరసేన వీర వర్మలతోఁ గార్తవీర్యార్జునుఁడు ప్రవేశము.]

కార్త:—

సీ॥ మత్ప్రియాసేతిసైన్య సజ్జనములెల్ల
వింతైన నొక్క భోజనములంగో సంతరించె,
ధేనువా యిది? నేనేల చెప్పి విమాలి
యష్టసిద్ధులకొలువు నెంతటి పుట్టించె!

మహాతపః పరిపాకమునం గాక యిట్టి స్వర్గానికి లభించునా! సర్వసంగపరిత్యాగులగు జడదారుల కిట్టి ధేనువు లెందుకు? శూరసేనా, మనము నేఁడనుభవించిన రాజభోగ్య మీ గోమహిమవలననే గదా! ఈ గోవు మనకుండిన బాగుండును. ఇచటనుండ యడవింగాచిన వెన్నెలయే యగు...... హోమాదికర్మానుష్ఠానమున కీమునికిఁ గావలసి నన్ని ధేనువులం దోలిపెట్టింతము.

శూర:— అయిన మనతో దీనిఁ గొంపోవుదము.

వీర:— ఈముని మనపైఁ గినిసి శపించునేమో!

కార్త:— వీరవర్మా, యెంత వెఱ్ఱివాఁడవు. శాపములకుఁ బ్రతిశాపములు లేవా?

వీర:— ఈ మునితనయులలో నొకఁడు పరశురాముఁడను వాఁడు శివశిష్యుఁడట-లోకైకవీరుఁడట. క్రౌంచ పర్వతమున రంధ్రము గావించిన కృతహస్తుఁడట. కుమారస్వామి నోడించిన జయశీలుఁడట.

శా_ర్త:— మేలు మేలు! అట్టి వీరశిఖామణితో నాకుఁ బోరాట మెప్పు డుప్పతిల్లునా, నాబాహువుల కండూతి యెన్నడు తీఱునా యని యెంతకాలమునుండియో కొండంతయాసతో వేచి యున్నాను. ఈ యావు మూలముననే నాకా వీరకుమారునితోఁ బోరు తారసిల్లిన నాకోరిక కొనసాగినట్లే!......

పరికాని శిరకర్మా, సాంగోపాంగముగా ధనుర్వేదము సర్వ ము గ్రాహ్మణు లభ్యసింతురే నేఁ, వారు పరాక్రమవంతు లగుదురా? శౌర్యము క్షత్రియులది. క్షాత్రగుణమునకు జన్మము కారణమగునుగాని అది యభ్యాస లభ్యమగునా? ఎంత భ్రాంతి పడితివి?

శా॥ భూమిన్ సన్నృప రక్షఁగాఁగలరు గో
వుం బట్టి కొంపోవ? సు
త్రాసారామములోని కామగవి మా
త్రం బేను రమ్మన్న రా
దా మాహిమ్మతికిన్? సురాసురులు తో
డై కూడి దండెత్తి నా
తో మాఱ్కొందురు గాక. వోరితమునం
దు న్నన్ను సాధింతురే!

వీర:— నిజము. నిస్సంశయము. ధేనువుం గొనివచ్చుటకు భటులకు నీయానతిం దెలియఁజేసి, పురమునకుఁ బయనముకండని చెప్పి వచ్చెదను ప్రభూ.

శా_ర్త:— అట్లు కావింపుము (వీరవర్మ నిష్క్రమించును)

(శూరసేనునితో) పరసాన్నములు మధురపదార్థములు భుజించి నానావిధ పానీయములు త్రావి మత్తిల్లి మయూరధ్వజుఁడు నిద్రించు చుండునేమో. నీవేగి యాతని మేల్కొల్పుము.

శూర:— చిత్తము (శూరసేనుఁడు నిష్క్రమించును).

కార్త:— తప్పక గోవుం గొంపోవలయును. నాకుఁ బరశురాముని వలన భయమా! (అట్టహాస పూర్వకముగా) ముని తనయుని వలన గార్తవీర్య చక్రవర్తికి భయమా?

మ॥ జితనైరిక్షితినేతనై, విజయలక్ష్మీదేవికిన్ వీరభా
రతికిన్ సారథినైతి నెన్న, నిఁక శూరవ్రాత కౌక్షేయ మా
రుత సంధుక్షితమైన స్వీయసముదగ్రక్రోధాగ్నికీలావళిన్,
హుతభుక్తేజుఁ డలెందు విప్రయువకుం గ్రొవ్విన్ సమ్యాళిఁ మాయునే!

(నిష్క్రమించును - తెరవ్రాలును.)

---

# ప్రచండ భార్గవము

## ద్వితీయాంకము - సప్తమరంగము

[స్థలకము - జమదగ్న్యాశ్రమము - సాయుధముగాఁ బరశురాముఁడు ప్రవేశము. ఆశ్రమ వృక్షములకు రుమణ్వత్సుషేణ వసు విశ్వావసులు బంధింపఁ బడియుందురు. రేణుక మూర్ఛిల్లి నేల వ్రాలి యుండును.]

పరశురాముఁడు:— (తల్లిని జూచి సమీపించి) ఏమిది, మాయమ్మ యేటి కిట్లు సొమ్మసిల్లినది?...అమ్మా, అమ్మా, (నలుకెలంకులఁ జూచి) మాయన్నలా? అయ్యో, చెట్లకుం గట్టివేయఁబడిరా? హా, ఘోరము! (సోద్వేగముగా నేగి వారి బంధములను విప్పును) అన్నా విశ్వావసూ, యీ మహాపరాధ మొనర్చిన దుర్జాతి యెవ్వరయ్యా? (తల్లి చేరువం జేరును) అమ్మా, (తట్టును) పలుకవేమి?

(రేణుక కనులు దెఱచి లేచును, పరశురాముం జూచును.)

రేణుక:— నాయనా, వచ్చితివా! ఎంతసేపైనది?

పరశు:— ఇపుడే,...అమ్మా, నీవిట్లు మూర్ఛిల్లితివేల? మాయన్నలను బంధించినదెవరు?

రేణుక:— ......మన హోమధేనువును...

పరశు:— ఏమి తల్లీ. హోమధేనువేమైనది? ఎవ్వరు కొంపోయిరి?

రుమణ్వంతుఁడు:— ప్రభువొక్కఁడు మన యాశ్రమమున కేతెంచినాఁడు.

పరశు:— మన ధేనువును క్షత్రియుఁ డపహరించెనా?

సుషేణుఁడు:— అతఁడును వాని యనుచరులును మన యావు ప్రసాదించిన భక్ష్య భోజ్యాదులను దనివిదీఱ నారగించినారు. పోవుచు మన యావుం దోలుకొనిపోయినారు.

దుసునాడంగల పోడిమిఁ మెఱసి, తో
ర్తు, నిండు సత్కీర్తితో
మన గోవుంగొనిపోఁగఁగోయి, భృగురా
మా, యకృతాంగుండవై !

(కుమారుని గాఁగిలించి లేవనెత్తును)

పరశు:—(ప్రచండముగా) ఓరీ రాజాధమా, నేను క్షత్రియకుల కాళరాత్రినని యెఱుంగవా! కాలానలమును కాఁగిలింప గమకించితివా? ముక్కంటి మూఁడవ కన్ను ముద్దుపెట్టుకొన నెంచితివా?

స్రగ్ధర॥ గ్రావాళిన్ వజ్రధారన్
గ్రతుభుగధిపుఁ డుగ్రక్రియన్ ద్రుంచులీలన్
జేవన్ గొడ్డంటఁ ద్రుంతున్,
క్షితిపడఁగ, భవచ్ఛీర్షముల్ బాహుశాలిన్
గోవున్ రక్షింతుఁ బ్రీతిన్
గురుజనములకుం గూర్చెదన్ సంతసంబున్
భావిక్షోణీపతుల్ నా
భయమున మునులన్ భక్తి సేవింత్రుగాతన్.

(పరశువు గిరగిరఁ ద్రిప్పుచు) ఇదే వచ్చుచున్నాను.

(నిష్క్రమించును - తెర వ్రాలును)

———

# ప్రచండ భార్గవము

## తృతీయాంకము - ప్రథమ రంగము

[స్థలము - మాహిష్మతీనగర పరిసరోద్యానము - శిలాతిన్నెపై నాసీనయై పూవులు దండగా గ్రుచ్చుచుఁ బాటపాడుచుఁ జంద్రరేఖ ప్రవేశము - పాట పూర్తికాఁగా వనపాలకుఁడు - ఆక్షేపకుఁడు ప్రవేశము]

ఆక్షేపకుఁడు:—అమ్మా, చంద్రరేఖమ్మగారూ, మయూరధ్వజులవారు దయచేయుచున్నారు.

[ఆక్షేపకుఁడు నిష్క్రమించును - చంద్రరేఖ లేచి యెదురేగి మయూరధ్వజుం దోడితెచ్చును. ఇరువురు నాసీనులగుదురు.]

చంద్రరేఖ:—చంద్రోదయ వేళకే వత్తునంటిరిగదా!

మయూర:—చంద్రరేఖ యీచోట నుదయించి యెంతసేపైనది?

చంద్రరేఖ:—(చిఱునగవుతో) రెండు గడియలైనది. మఱి మీరేల ఆలసించితిరి?

మయూర:—చక్రవర్తిగారితో గోశాలకేగితిని. అచ్చట పొద్దైనది.

చంద్రరేఖ:—క్రొత్తయావు మేఁత మేయుచున్నదా?

మయూర:—మేఁతలో మూతి పెట్టుటలేదుగదా నీరు సైతము మానినది.

చంద్రరేఖ:—నేఁ జూచినప్పుడు కన్నీరు గార్చుచుండినది. ఇప్పుడో?

మయూర:—ఇప్పుడు నక్లైయున్నది. ఆ యావుం గొనివచ్చుట న్యాయ్యమే. అందులకు శూరసేనాదుల ప్రోత్సాహమే ముఖ్యకారణము.

చంద్రరేఖ:—మహారాజ్ఞి మనోరమాదేవి కా యావుం గొనివచ్చుటే మాత్రమును నచ్చలేదు. ఆస్థానదైవజ్ఞులం బిలిపించి యాదేవి జాముసేపు మాటాడినది.

మయూర:—ఏమో, యెన్నిసంగతులో ?

చంద్రరేఖ:—ఎన్నోసంగతు లెక్కడివి ? ఒకటి రెండు మాత్రమే.

మయూర:—చెప్పవూ చంద్రరేఖా యవేవో ?

చంద్రరేఖ:—మొదటిది - హోమధేనువుంగూర్చి.

మయూర:—రెండవది ?

చంద్రరేఖ:— రెండవది రహస్యము. నేఁజెప్పరాదు....కంటిరా, యీ పూవులయందము. ఇవి యెంత సుందరములో యంత సురభిళములు (పూవులు మయూరధ్వజుని దోసిటంబోయును.)

మయూర:— (అఘ్రాణించి) అవును.

చంద్రరేఖ:— లోకమున సౌందర్య సౌరభ్యము లొక్కచోఁ గుదురకొనియుండు టరుదుగదా !

మయూర:— అరుదంటవా ?

చంద్రరేఖ:— కాదా ? వెదకి వెదకి వేసారఁగా నెచ్చటనో యొకటి నొకట.

మయూర:— ఎచ్చోటికిఁబోవలయునా ?

చంద్రరేఖ:— మరి ?

మయూర:— ఆనందకందమైన సౌందర్యముతో, సుమనో మనోహరమైన సౌరభ్యముగల యొక యపూర్వవస్తువు నా కిప్పు డిచ్చటనే లభింపలేదా ?

చంద్రరేఖ:— ఇచ్చటనా ?

మయూర:— అవును.

చంద్రరేఖ:— నిజమా ? పరిహాసమా ?

మయూర:— నీతోనా ?...నిరూపించినచో నేనడిగిన పారితోషకమిత్తువా ?

చంద్రరేఖ:— తప్పక.

మయూర:— సరే !...మఱచితిని, చంద్రరేఖా, మహారాజ్ఞిగారు దైవ

జ్ఞులతో మాటాడిన రెండవ విషయము 'అతిరహస్యము' - అని చెప్పక నన్ను గికురించితివే చెప్పవూ ?

చంద్రరేఖ:— ఇప్పటి మీకు లభించిన యపూర్వవస్తువేదో యెఱిఁగించినచో.

మయూర:— ఇదిమాత్రము రహస్యము కాదా యేమి?

చంద్రరేఖ:— ఇఁకనైన బాధింపక చెప్పఁగూడదా. మీ పుణ్యము.

మయూ:— ఎఱిఁగింతునా ?

చంద్రరేఖ:— ఊఁ.

మయూర:— నాకు దొరికినది - ఒక సుఖస్వప్నము.

చంద్రరేఖ:— (ఉత్కంఠతో) ఏదీ!

మయూర:— (చంద్రరేఖ నాశ్లేషించి) ఇదిగో! (ఇరువురు నవ్వుకొని యానంద పరవశులగుదురు)

— రాణిగారు జ్యోతిష్కులతో మాటాడిన రహస్యమో?

చంద్రరేఖ:— (మయూరధ్వజుని చెవిలో) మన వివాహమునకు మంచి ముహూర్తమే ! యను విషయము.

మయూర:— ఊఁ-హాఁ-అదిగా ? మాటలలో మరచితి నేదీ నా పారితోషికము ?

చంద్రరేఖ:— కోరుకొనుఁడు.

మయూర:— ఒక్క మధురగీతి -

(చంద్రరేఖ పాడుచుండును - తెర వ్రాలును)

——

# ప్రచండ భార్గవము

## తృతీయాంకము - ద్వితీయ రంగము

[స్థలకము - మాహిష్మతి - రాజాంతఃపురము - మనోరమ నిద్రించుచుండును - కార్తవీర్యార్జునుడు వ్యాకులమనస్కుడు ప్రవేశము.]

కార్త:— మనోరమా, మనోరమా,... నిద్రించినది. అర్ధరాత్ర మతిక్రమించినను నేడేల నాకు నిద్దుర రాకున్నది? ఏదో యాందోళన మొక్కటి నాహృదయమున నుదయించి నన్ను సంకటపెట్టుచున్నది. ఏమిది, చిత్తమునకు విశ్రాంతి కుదురకున్నది? ఊహింపరాని యమంగళమును నామానసము శంకించుచున్నది - ఆమంగళమా? అర్జునున కమంగళమా?

సీ॥ ఆహవక్షోణిలో బాహుసాహస్రంబు
ప్రకటించు భూరి పరాక్రమంబు
మేదురశక్తి నష్టాదశ ద్వీపముల్
పాలించు పటు సార్వభౌమపదము
దిగ్దంతి దంతకాంతిం బంతగించెడి
దాన ధర్మక్రియాధీన యశము
అమిత ప్రభావ దత్తాత్రేయ గురు కటా
క్షాసాదితం బణిమాది సిద్ధి

గీ॥ కలవు నాయందు - లోకభీకరుడనైన
నాకు - దుర్వార మౌర్వీనినాదకలిత
చాపజీమూత సంజాత శరసమూహ
వర్షశమితారి వహ్నికి, భయముగలదె?

మనో:— (నిదురలో) ఆ. ఆ. బ్రాహ్మణుఁడవు...గండ్రగొడ్డలి! ఏమొనర్తువు?

కార్త:— మనోరమా, మనోరమా, (సమీపించుచు) ఏమి, కలవరించుచున్నావా? కల వచ్చినదా? (తట్టును)

మనోరమ:— (దిగ్గన లేచి, నలుకెలంకులఁ జూచి, చీకాకుతో) కలగు, కలను!

కార్త:— ఏమి నీ భ్రాంతి ప్రేయసీ, కల వచ్చినదా? భయపడితివా?

మనో:— (తెలివి తెచ్చుకొని) నాథా, నాకొక పాడుకల వచ్చినది. ఒక బ్రాహ్మణ బ్రహ్మచారి, పరశుధారి, తన యావును మీరు గొంపోవుచున్నారని మిమ్ము వెంబడించి...తన గండ్రగొడ్డంట... ఏమి వచింతును? నా శరీరము...కంపించుచున్నది—నాకన్నులు గిర్గిరం దిరుగుచున్నవి...

కార్త:— మనోరమా, యేమి నీ భీరుత్వము? ఏమి నీ వెఱ్ఱితనము? ఎంత వెఱవు! కలలో గాంచినవి కల్లలు గాక యథార్థములగునా? మిణుఁగురుఁ బురువులఁ గని విస్ఫులింగములని విభ్రాంతి నొందునట్టు గదా యిది!

మనో:— దుస్స్వప్నము లమంగళ సూచకములు గావను యేటిమాట? అది యటుండనిండు. మీరు ధేనువుం గొనివచ్చినప్పటినుండియు నా చిత్తమునకు శాంతి లేకున్నది.

కార్త:— అవును. అదియే కారణము నీకలకు. కలలన్నియు నిక్కములగునా?

మనో:— పోనిండు నామాట మీరేల వినరాదు? సుపర్వసురభులఁ దృణీకరించు పయస్వినీ సహస్రములు గలవుగదా మనకు! ఈ యావు మనకేటికి? దీనిని సత్వరమ మునీశ్వరు నాశ్రమమున కంపివేయుఁడు. జమదగ్నికుమారుఁడు మహా పరాక్రమశాలి యని విందుము. నాకుఁ గలలోఁ గన్పడిన వాఁడాతఁడే సుమా!

కార్త:— రమణీమణీ, అయినఁ గానిమ్ము. ఆ విప్రకుమారుఁడు బాణాసురునికన్న బలవత్తరుఁడా?

గీ॥ భూతనాథునగము పూబంతివలె నెత్తఁ
గలిగినట్టి పంక్తికంఠుఁబట్టి
యల్లెత్రాటఁ గట్టి యూఁకఁ ద్రోసినవాని
నోర్చువాఁడె విప్రయువకుఁ డొకఁడు?

మనో:— బలాబలము లటుండనిండు. మునులధేనువులఁ గొనివచ్చుట మనకుఁ దగనిపని సుమా!

ఉ॥ కంచెయె చేనుమేసిన జగమ్మున రక్షకులెవ్వరింక? శి
క్షించు నధర్మవర్తనుల - శిష్టపథమ్మునఁబోవువారిఁ బో
షించు వసుంధరాధిపతి: చెప్పె నమ్మునిశాసి, గోవు న
న్బంచి తపస్విపుఁ డెంచదగునే సుమ మిమ్ములఁ బ్రాణ
నాయకా!

కార్త:— నీవింతటి రాజనీతి విశారద వెప్పుడైతివి మనోరమా,

[వృద్ధకంచుకి ప్రవేశము]

వృద్ధకంచుకి:— జయము జయము మహారాజులుంగారికి— కోట బహిర్ద్వారమునుండి చారుఁడొక్కఁడు వచ్చేసి, యంతఃపురము వెలుపల వేచియున్నాఁడు. దేవరవారి యానతికై నిరీక్షించుచున్నాఁడు

కార్త:— ఈ నడిరేయి చారులకు నాతో నేమిపని?

వృద్ధకంచుకి.— దేవరవారు క్షమింపవలయును. అత్యంతముఖ్య వృత్తాంతమఁట. దండనాయకుని కడనుండి వచ్చియున్నాఁడు.

కార్త:— అట్లయిన శీఘ్రమే ప్రవేశపెట్టుము.

[వృద్ధకంచుకి నిష్క్రమించును - చారుఁడు ప్రవేశించును.]

కార్త:— ఏమి వార్త?

చారుఁడు:— సేనాని ఉగ్రసేనవర్మగారు దేవరవారికీ యుత్తరము పంపించినారు. (లేఖ నందించును.)

కార్త:— (చదువును) -

“రణక్రియా దక్షుఁడు - పరశుధారి - మునికుమారుఁడు-
మార్గరక్షకుల నూఱుమందిని చించి చెండాడినాఁడు-
మన సైన్యము నుగ్గునూచే యగుచున్నది.”

కార్త:— ఏమి చిత్రము!... అశ్వశాలాధికారి కప్పుడే ఇంద్రద్యుమ్నమును గట్టాయితము గావింపుమని యిదే నా యాజ్ఞ.

చారుఁడు:— మహాప్రసాదము. (నిష్క్రమించును)

మనోరమ:— మునికుమారునితో సార్వభౌమునికి సంగ్రామమా?

కార్త:— .........

మనోరమ:— కష్టమైనను నిష్టమైనను సమానస్కంధులకు సంఘటిల్లినప్పుడే ...

కార్త:— వలదు. మాటాడవలదు. (ఆగ్రహముతో) మనోరమా, రాజకార్యములలో నీకీ జోక్యము వలదు.

మనో:— క్షమింపుఁడు. నే నేమంటిని? ప్రభువులకుఁ దపస్వులతో వైరములా యని యంటిని. ప్రాణేశ్వరా, నాపై-అలుకయా?

కార్త:— ప్రియా, యిట్టియెడ నీ పల్కులు తగవు.

మనో:— ఈనాఁడు నాహృదయము చేయిపెట్టి కలఁచినట్లున్నది. దయయుంచి నామాట వినుఁడు. ఈవేళ మీరు పోవలదు.

కార్త:— నీవు వీరపత్నివిగావా మనోరమా? భీరువులదారి నడచుచున్నావు సుమా!

మనో:— నాయీప్రణయము నొప్పరికింతురా?

కార్త:— (పెడమోము పెట్టును)

మనో:—నా ప్రార్థనము నిరాకరింతురా ?

కార్త:—నీతత్త్వము నేనింక సైరింపను. (ఉద్వేగముతో) మానవా మనోరమా ? (పోఁబోవును)

మనో:—మన్నింపుఁడు. క్షణము నేపుండుఁడు.

[లోనికేగి కుంకుమ అక్షతలు కుసుమమాల పళ్ళెరమునం దెచ్చును]

ఆర్యాదేవి యార్యపుత్రునికి సంగరమున మంగళము నొసంగుఁ గాక ! (ప్రియుని నుదుట కుంకుమబొట్టు పెట్టును)

మ॥ పగవానిన్ విగతాసుఁ జేసి, విజయప్రాప్తిన్ విజృంభించుచున్
మగసామిన్ జగమెల్ల సహృదయమున్ బ్రాపించి వర్ధిల్ల, నా
వగచెల్లారఁగ వీఁక నాకపతి సుప్రాకుఁ జేతేరఁగా,
నగుచెండ్రుండను చెల్వుఁగాఁ జెలఁగి దుర్గానవ్యామృతాసారమున్

(సుమమాల పతికంఠసీమఁ గీలింపఁబోవఁ జేయిజారి నేలఁబడును)

ఆర్యా, యమంగళము... ప్రాణప్రియా, వలదు వలదు (నేలవ్రాలును)

కార్త:—ఆమంగళము నావైరికి. మరణము నావిరోధికి. వీరుని కచ్చోట విజయము. లేదా యచ్చోట స్వర్గము. తెలియదా నీకు ? (పరిక్రమించి)

స్రగ్ధర॥ వైరిన్ భంజింతు నొంతున్
ప్రకటితభుజదర్ప ప్రభావం బెలర్పన్
ఘోరాజిన్ విక్రమింతున్
గొనకొని జయముం గొందు నానంద లీలన్
తోరంపుం బూలవానల్
దొలఁకఁగ, దివిషద్దుందుభుల్ మింట మ్రోయన్;
వీరక్షాత్రాగ్ని మ్రోలన్
వెలయఁగలవొకో విప్ర వంశాంకురంబుల్ ?

(నిష్క్రమించును- తెరవ్రాలును)

# ప్రచండ భార్గవము

## విష్కంభము

[స్థలము - జమదగ్ని యాశ్రమము - ప్రవేశము - జమదగ్నిముని శిష్యులు గాలవ శాలిహోత్రులు]

శాలి:— గాలవా, ఏమి రావయ్యా, ఇంతేనా నీమనసుదిటవు? వనవాసులకు నాన ఎంతటి యనుమానము తగునా? ఒక్క పండైనఁ మింగవు లెమ్ము.

గాల:— వలదు, నన్ను బాధింపవలదు.

శాలి:— ఇంక నీవైనఁ బ్రాణి హానిఁడై నాలుగు దినములైనవే. శోష వచ్చును. నీ మొండిపట్టు విడవుము.

గాల:— హోమధేను యెచ్చోట నున్నదో? మేఁత మేయుచున్నదో లేదో? ఆ రాజఘాతకునింట నేమేమి యిడుములఁ బడుచున్నదో!

శాలి:— దానికేవియు భయములేదు.

గాల:— ఆ దుర్మార్గుఁడు గోవును హరించిన నాఁటినుండియు నీయాశ్రమ పరిసరకురంగములకు కన్నీరు నించుటఁ జూచితివా? అదిగో యా తియ్యమామిడి గున్నపై పికమౌనము. పండ్లగుత్తులపైఁ గూరుచున్న చిలుకలు సైతము నోరు మెదల్పకున్నవి.

శాలి:— నిజమే. యీ యాశ్రమరూపమే మారిపోయినది.

గాల:— ఆ కృతఘ్నుఁడు - కృతవీర్యనికొడుకు తన పాపఫలము ననుభవింపకపోవునా?

శాలి:— ఏమో వానియదృష్టమెట్లున్నదో?

గాల:— వంచకుఁడు, ద్రోహి! రాముని పరశుధారాహతి రుచిచూడఁ దలఁచి దొంగిలించినట్లున్నది. వానికిఁదగిన శాస్తి కాకమానదు. సందేహములేదు.

శాలి:— ఎట్లు కట్టువడినదో పాపము! తప్పక తప్పించుకొని యది యిచ్చటికి వచ్చునని నావిశ్వాసము.

(‘గాలవా, శాలిహోత్రా’ అని నేపథ్యమున ధ్వని) గురువుల వారు పిలుచుచున్నారు. పోవుదము రమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు. తెర వ్రాలును)

# ప్రచండ భార్గవము

## తురీయాంకము-ప్రథమరంగము

[స్థలకము-మాహిష్మతి - అంతఃపురము-మనోరమా చంద్రరేఖలు ప్రవేశము]

చంద్రరేఖ:—(విసరుచు) కోఁడిల్లును దేవీ, బ్రాహ్మణ బాలకులవలనఁ బ్రభువుల కపాయమా?

మనోరమ:—చంద్రరేఖా, కాల మెల్లప్పుడు నొక్కరీతిగా నుండునని తలంతువా? (దాసి ప్రవేశించును)

దాసి:—అమ్మా, మయూరధ్వజులవారు వచ్చి వేచియున్నారు.

మనోరమ:—వేగిరము ప్రవేశపెట్టుము.

(దాసి నిష్క్రమించును-మయూరధ్వజుఁడు ప్రవేశించును)

మయూర:—దేవిగారికిఁ బ్రణమిల్లుచున్నాను.

మనోరమ:—నీకు శుభమగుఁగాక. రణరంగమునుండి వచ్చితివిగదా, విశేషము లేమి?

మయూర:—దేవీ, యాకర్ణింపుము. మహారాజులుంగారు యుద్ధరంగముం జేరునప్పటికి పరశురాముని తొలిప్రేటుకే శూరసేన వీరవర్మలు మరణించిరి. అవల సేనాని యుగ్రసేనుఁడు మొక్కవోని విక్రమముతోఁ బోరాడి వైరి పరశుధారకెరయై వీరస్వర్గ మలంకరించెను.

మనోరమ:—(సోద్వేగముగా) ఉగ్రసేనుఁడా? అయ్యో,

మయూర:—అవును. అతఁడే!

మనోరమ:—ఉగ్రసేనా, వీరాధివీరుఁడవు. ఉగ్రసంగరముల నెన్నింటనో, విరోధివాహినులం ద్రోల్చివైచి, నానాదిశల విజయస్తంభముల నాటించినవాఁడవు. అపుడే నీప్రాయపుం బ్రొద్దుగ్రుంకినదా? హా!

మయూర:—అంతట సేనాధిపత్యము సేనాగ్రణియగు మణిగ్రీవుఁడు వహించెను. అతఁడు ప్రదర్శించిన శౌర్యచాతుర్యము దర్శనీయము దేవీ! జాముక్రిందట నొక విచిత్రము జరిగెను. మణిగ్రీవుని వింటినుండి శరమొక్కటి వెడలి, విలయానిలవేగముతోఁ బోయి, పరశురాముని గండ్రగొడ్డలి నాకసమున కెగురఁగొట్టెను.

మనోరమ:—మేలు! మణిగ్రీవా మేలు! వర్ధిల్లుము.

మయూర:—తిరువాత, పరశురాముఁడు అత్యున్నత వింధ్యగిరి శిఖరమునఁ బరశువు నొడిసిపట్టికొని, ఉరగముం దాఁకు గరుత్మంతునివలె మణిగ్రీవునిపై దూఁకి, యొక్క వ్రేటున నుక్కడంచినాఁడు.

మనోరమ:— హా మణిగ్రీవా, మణిగ్రీవా, నీకు సురపదమందితే సంతసించితిఁ గదా!

మయూర:—అప్పటినుండి మహారాజే స్వయముగ సైన్యముల నడపుచున్నాఁడు. అలనాఁడు నర్మదానదియొడ్డునఁ జక్రవర్తికిని రావణాసురునికిని జరిగిన సమరము కన్నులఁ గట్టుచున్నది. .

మనోరమ:—ఏమీ, నా బ్రాహ్మణబాలుఁ డంతటివాఁడా?

మయూర:—కాదే, సాక్షాత్ దశావతారపురుషుఁడని తోఁచుచున్నది. ఎంతటి బలాఢ్యుఁడైనను వాని వ్రేల నంటెదనై పోవుచున్నాఁడు.

మనోరమ:— పోరికలనికి నీవు మరలఁ బోయిరమ్ము.

మయూర:—పోవుచున్నాను. కాని మరలివచ్చుట కింక వలనుపడదేమో! అమ్మా, నన్ను సగౌరవసన్మానముతో రమ్మని సార్వభౌముఁడు వర్తమాన మంపినాఁడు. మూలబలముల నాయత్తము చేసికొని పోవుచున్నాను... అచ్చటి విశేషములు మీకప్పటప్పటిక నివేదించుటకు మంజీరకుని నియమించితిని. సెలవా?

మనోరమ:—పోయిరమ్ము... చంద్రరేఖా, వీరిని గడపటి కక్ష్యాంతరము వఱకు సాగనంపి రమ్ము.

(మయూరధ్వజుఁడు చంద్రరేఖ నిష్క్రమింతురు-తెరవ్రాలును)

# ప్రచండ భార్గవము

## తురీయాంకము - ద్వితీయ రంగము

[స్థలకము - కాళికాలయము - ప్రవేశము మనోరమ]

మనోరమ:— అమ్మా, యీ నీ దాసురాలిపై నీ కరుణాకటాక్షము ప్రస
రింపఁజేయవా ? నీవుగాక నాకు దిక్కెవ్వరు ?

శా॥ దేవీ,నీ వలవోక లోకములఁ బ్రీతిన్ సృష్టిగావించి,యా
పై వర్ధిల్లఁగఁ జూచి, తుట్టతుదిమాఁపం జేసి, మూర్తి త్రయ
శ్రీ వర్తిల్లెడు దివ్యశక్తివి సమర్చింతున్ నినున్ భక్తిమై.
ఈవే నన్నుఁ దరింపఁజేయవలెఁ దల్లీ, యీవిపన్నిరధిన్.

నీ యున్మేషమే జగత్సృష్టి, నీ నిమేషమే ప్రళయము - నన్ను
బ్రోచుటకు భారమా నీకు ?

మ॥ దాసంగుల్ బ్రోచి, సమాదరించి జనయి
త్రుల్ వత్సలత్వంబుతోఁ
బసివారిన్ బరిత్రాణఁ జేయుదురు స
ర్వశ్రేయముల్ గూర్చి: నే
నసహాయన్-భువనైకమాతవగు ని
న్నాలంబ నూహింతు-నా
పసుపుంగుంకుమ నిల్పఁబెట్టు మనుకం
పావృత్తిం గాత్యాయనీ!

(కర్పూరము వెలిఁగించి హారతి యీయఁబోవ జ్యోతి యారి
పోవును. మనోరమ 'హా' యని మూర్ఛిల్లును.)

(చంద్రరేఖ ప్రవేశించును)

చంద్రరేఖ:— (మనోరమంజూచి నిర్విణ్ణయై) అమ్మో, దేవి యిట్లుం సొమ్మసిల్లినది. దేవి, దేవీ, (తట్టి), అయ్యయ్యో, (విసరుచు) ఏ మొనర్తును?

[మనోరమ కనులు తెరచును]

మనోరమ:— ఎంతసేపైనది చంద్రరేఖా నీవిటకు వచ్చి?

చంద్రరేఖ:— ఇప్పుడేనమ్మా, నీవేల యిట్లున్నావు?

మనోరమ:— ఏమని వచింతును చెలీ, ఈశ్వరికి నాపై దయతప్పినది.

చంద్రరేఖ:— ఏమైనది? ఎందుకు నీకీ యధైర్యము తల్లీ?

మనోరమ:— ఇంకేమున్నది చంద్రరేఖా, నేటికి నీరాజనము వెల్గించి హారతి యీయఁబోవ...... హారతి ఆరిపోయినది. (కన్నీరు నించును)

చంద్రరేఖ:— ఊరడిల్లుము లే, ఇంతకా?

మనోరమ:— ఆ హారతిలో - పూలదండ నేలఁబడుట - ఈనాఁడే యపశకునము!

చంద్రరేఖ:— ఈ యధైర్యము నీకుఁదగునా? అమ్మా, యథోచిత కవచాదులు ధరించి రణరంగమున కేగుదము. మహారాష్ట్ర మహారాజుగారికిం దోడ్పడుదము.

మనోరమ:— ఉచితమైన యుపదేశించితివి. నెచ్చెలివన్న నీవే. ఇట్టి సమయములఁగాక మన చిన్ననాఁటి ధనుర్విద్యా కౌశల మెప్పు డుపకరింపఁగలదు? రమ్ము పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు. తెరవ్రాలును).

# ప్రచండ భార్గవము

## తురీయాంకము - తృతీయ రంగము

### (స్థలకము - రణరంగము)

[ఆయుధపాణియగు కార్తవీర్యార్జునుఁడు ప్రవేశము]

కార్త:— (స్వగతము) ఘోరరణ విహారము - ఎంత కొల్బలము! ఎంద అశ్వికులు! ఎందఱు గజారూఢులు! ఇంత మహా సైన్యము నద్దెసలం గ్రమ్ముకొని యుద్ధ మొనరించుచున్నను స్థైర్యము వీడక పోరుచున్న యీ పరశురాముఁడు మానవమాత్రు డని తలంచుట వెఱ్ఱి.

దిగ్విజయముం గావించినవాఁడను. దిశాపతులనెల్ల నోడించిన దశకంఠుని బందిగావించిన యశస్విని, ఈ మునికుమారునిచేఁ బరిభవింపఁ బడుచున్నాను. ఈతని ముందు నా సామర్థ్యము వ్యర్థమగుచున్నది. ఈ బుడుతని శౌర్యాగ్నిలోఁబడి నా సేనాధిపతులు బూడిదైపోయిరిగదా! ఎంత విచిత్రము!

సూర్యాస్తమయముతో నేఁటికి యుద్ధము చాలింపఁబడినది. ఏదేని పన్నుగడ పన్నవలయు.

పరశురాముని కుడి పాదమునఁ దీవ్రమైన గాయమయ్యెననుట నిశ్చయము. అంత గాయమైనను, రక్తము ప్రవాహమగుచున్నను, లేశమైన నాతని పరాక్రమము మొక్కబోయిన చిహ్నము కాన్పింపదు. ఏమద్భుతమిది?

నర్మదానది యొడ్డునఁగదా యీతఁడు రాత్రివేళల విశ్రమించుట! ఈ బాలు నెట్లైన వంచింపవలయు.

ఇతని బాహుబలము - సాహసము - ధనుర్విద్యాకౌశలము - పరస్పరము ప్రతి స్పర్థించుచున్నవి. ఈ యన్నింటికన్న మిన్నయైన యితని

బ్రహ్మచర్యప్రభావమే తని నజ్జయుని జేయుచున్నదని తోఁచుచున్నది....

ఇంద్రియజేత! మీఁదుమిక్కిలి పరమశివుని ప్రియశిష్యుఁడు! బ్రహ్మచర్యమా? (వికటాట్టహాసముతో) పరాశరునివంటి మునీశ్వరుల పాషాణ హృదయములను బాలికలు కనురెప్పపాటులో నీరు గావింపలేదా? ఇట్టి పసిబాలకుల చిత్తములను మెత్తచేయలేడా? చూచెదఁగాక! ఎట్లు తప్పించుకొనఁగలుఁడో!

ఇప్పుడు గాకున్న నా యణిమాదిసిద్ధుల ప్రయోజనమింకెప్పుడు? (కన్నులుమూసి తెఱచి, శిరఃకంపన మాచరించి) సంకల్పితాకారము ప్రత్యక్షమగుఁగాక!

[భువనమోహిని యవతరించును - నమస్కరించును]

భువనమోహిని:— స్వామీ, యేమి యాజ్ఞ!

కార్త:— నర్మదా నదియొడ్డునఁ బరశురాముఁ డీసుక తిన్నెలపై విశ్రమించి యున్నాఁడు. పోయి యుక్తమైన వంచించి యాబ్రహ్మచారిని నీయుచ్చులలోఁ దగిలించుకొనవలయును. వింటివా?

భువనమోహిని:— మీయానతి నౌదలం దాల్చితిని.

కార్త:— ఓడిపోయితివా?

భువన:— దేవర యాజ్ఞ.

కార్త:— పొమ్ము - నీ సామర్థ్యము సర్వము వినియోగింపుము. జాగ్రత్త సుమా!

[భువనమోహిని మోఁకరించి లేచి సెలవుగైకొని వెడలును.]

కార్త:— ఈ వ్యూహము నెట్లు భేదింపఁగలఁడో చూచెదఁగాక!

(నిష్క్రమించును - తెరవ్రాలును).

# ప్రచండ భార్గవము

## తురీయాంకము - చతుర్థరంగము

### స్థలకము - నర్మదానదీతీర సైకత స్థలము

[సొమ్మసిల్లి పడియున్న పరశురాముఁడు ప్రవేశము.]

(భువనమోహిని మెలఁకువతో మెల్లమెల్లఁగాఁ బరశురాముని సమీపించి, యతని గాయమునుండి స్రవించు నెత్తురు తుడిచివైచి, తాఁదెచ్చిన యౌషధము గాయమునకుఁ బొంగుపఱచి, కట్టుగట్టి, పర్యంకములో విశ్రమించుచుండును. పరశురాముఁడు పెదవులను నాలుకతోఁ దడపుకొనుచుండుట చూచి భువనమోహిని నదీజలము దోసిటఁగొని వచ్చి, నోటికందించి యాతని దప్పితీర్చును. పరశురాముఁడు కన్నులు తెఱచి చూచి విస్మితుఁడగును.)

పర:—ఎవ్వతె యీమె? జగన్మోహనాకారముం దాల్చిన యీ చైతన్యమెచ్చోటనుండి వచ్చెనో? భగవానుఁడగు నీశ్వరుని వంచింప శ్రీమహావిష్ణువు మోహిని యనుపేర నవ్యాకారముం దాల్చెనని చెప్పుదురు. ఆమె యిట్టిదేనా?

అమ్మా, నీ వెవ్వరవు? నన్నుద్ధరింప నేతెంచిన దాక్షాయణివా? సప్తమాతృకలలో నొక్కతెవగు నీవీ రూపమున నా గురువు నానతిచే నా బాధఁ దొలఁగింప నేతెంచితివా?

భువన:—ఇంచుక తగ్గినదా నీ గాయపుబాధ?

పరశు:—ఇంచుక తగ్గుటయేమి? సంపూర్ణముగ శమించినది.

భువన:—ఆ గాయ మెట్లున్నది?

పరశు:—నా శరీరమునకు నవ్యసత్త్వము లభించినది.—ఎన్నడు నన్నెఱుంగనిదానవు నీకేటికో నాపై నిట్టి యకారణ వాత్సల్యము? నీ ఋణము నేనెట్లు తీర్చుకొనఁగలను?

భువన:—మునికుమారా. నీవు నాకొక్క సాయము చేయవలయు.

పరశు:—అమ్మా, కార్తవీర్యునితోఁ బొసంగిన యుద్ధము విడిచిపెట్టుట తప్ప-మఱేకార్యమయినను గావించుటకు సంసిద్ధుఁడను. మహోపకారముసల్పిన నాభాగ్యదేవతవు. నీ కెవ్వరైన శత్రువులున్నారా? వారలను నిర్మూలింపవలయునా తల్లీ! నా గురుండగు ధూర్జటి, గురుకుమారుఁడగు కుమారస్వామి, వీరిరువురుగాక నీకపకార మొనర్చిన వారెవ్వరైన, వారిం బడించి కసిదీఱ నీయాజ్ఞనులఁ గావించెద-నీకు సంతసముం గూర్చెద, తల్లీ నీవెవ్వరవు?

భువన:—నేనొక దేవతా వనితను. అంబర విహార మొనర్చుచు వినోదమునకీ నదీతీరమునం దరుగఁదలఁచి యిట మూర్ఛిల్లియున్న నిన్నుం గని, జాలిగొని నీకీపరిచర్య గావించితి. సుకుమారశరీరముగల నీకీఖడ్గక్షతి యేల కలిగెను?

పరశు:—కార్తవీర్య చక్రవర్తికిని నాకును సంగరము పొసంగినదని మున్నె వచించితినిగదా, ఆ యుద్ధమున నాకీగాయము తగిలినది.

భువన:—ఎలప్రాయము - కుసుమకోమలమగు శరీరము - చక్రవర్తితో సమరము-బాగుబాగు, నీతలిదండ్రు లిందుకు సమ్మతించిరా?

పరశు:—మాహోమధేనువును దొంగిలించిన దుష్టరాజుని గర్వ నిర్వాపణము మాతలిదండ్రుల కేల సమ్మతముకాదు? వారి సమ్మదము గలిగించుటకే నా యీ సమరసంరంభము.

భువన:—బలవంతులతో బాలురకు - బాపలకు వైరములు తగునా?

కం॥ జననీజనకుల యాజ్ఞఁ
గొనకే, పసివాఁడ వీవు, కుటిలారిపయిన్
జేని, యని యొనరించెదవా?
మునితనయుల కిట్టి కార్యములు మేలగునే?

పరశు:—వైరిని జయింపఁజాలనని నాకొంతయేని సందియము లేదు.

భువన:—సరియే, అరాతి నిర్యాతనము కావలయుఁగదా! నీ చిత్తమునకు నూతనోత్సాహము చేకూర్తును. కర్ణరసాయనముగ గానమొనరించెద నాకర్ణింపుము.—

(పాటపాడుచు నృత్యమొనర్చును)

మునికుమారా, మేము దేవతా స్త్రీలము-మాకు సంగీత సాహిత్యములు వెన్నతోఁబెట్టిన విద్యలు. నాట్యకళ మాసొమ్ము. ఏమందువు? పలుకవేమి? (సమీపించును). సంగీతమన్న వైరస్యమా నీకు? గాంధర్వ వేదమర్యాద యిది!

(చిఱునగవుతో) మునికుమారా, నాకొకమాటయిచ్చియున్నావు మఱచితివా, యేమి? నీ వాగ్దానమును బరిపాలింతువుగదా.

పరశు:—నిస్సందేహముగా నెఱవేర్తును.

భువన:—వచియింతు, వినుము.

మ॥ చివురుంగైదువు జోదునాపయినిదాక్షిణ్యంబు లేశంబు లే
కవినీతిం గటకైన పూములుకు లేయంజొచ్చె దర్పించి, వ
చ్చి విపన్నన్ శరణంటిఁ, గాచి, భవదాశ్లేషంబు నాకిచ్చి, శా
త్రవ నిర్యాతనముం బొనర్పు, మునిపుత్రా, వీరచూడామణీ!

పరశు:—(విభ్రాంతుఁడై) నీవాక్కులు విస్మయము గొల్పుచున్నవి.

మ॥ తగునేయిట్టి యవాచ్యభాషణములో తల్లీ, ననుం గూర్మిప
ట్టిగ భావింపుము: కాఁడెదీ కుటిలపాండిత్యంబు నాప్రమోలఁజూ
పఁగ, ధర్మక్రియలన్ వరించి నియతిన్ వర్తించుమాంబోట్లనీ
చగతిన్ ద్రోసెడి మాటలాడకు, నమస్కారంబుగావించెదన్.

భువన:—మంచివాఁడవు- మేలు మేలు-మునికుమారుల సత్యవాక్సంపత్తి యిట్టిదేనా యేమి ? బాసతప్పుట నీ మర్యాద గదా ?

పరశు:—ఇట్టి గురుద్రోహము నీ మానసమున దాఁచి యుంచుకొని మోసగింతువని తలంపలేను. ఎంత మోసము !

ఔరా, దేవతాసుందరివి, మునిపుత్రుని మోహింపఁ దగవా ?

భువన:—వాగ్దానము దప్పుగావించి వాదమునకు దిగితివా ?

పరశు:—(స్వగతము) ఏమాశ్చర్యము ? మాయలమారి కార్తవీర్యుఁడే యీ సంవిధానము ఘటించియుండునా ?......సందేహము లేదు. (ప్రకాశము) ఓవనితా, నీవెవ్వతెవైన నాకేమి ? నాచిత్త విశ్రాంతికి భంగము గావించితివి. నీవిచ్చోట నిలువరాదు - పొమ్ము...పోవా ?

భువన:—పోనిచో ! ఏ మొనర్తువు ? (నవ్వుచు), స్త్రీహత్యాపాపము నకుఁ బాల్పడుదువా ?

పరశు:—నేఁ జేయనెంచినదేమో, యది యట్లుండని, పొమ్మిఁకనలకు.

భువన:—వెడలిపోవలయునా ? పోయెదను, పోవుచున్నాను.

ఉ। ఆడినమాటతప్పిన మహాఘుము-గాయముమాన్పినట్టిప్రాఁ
బోఁడిని దూలనాడి, నయముఙ్ విడనాడి,కృతఘ్నవృత్తితోఁ
గీడొనరింపఁ బాల్పడిన కిల్బిషముఙ్ నినుపీడిపోవగో
బాడబ,తత్ఫలంబుగఁ బ్రవర్తిలు ముద్విని బ్రహ్మచారివై !

పరశు:—(ఆగ్రహముతో) నీ దృష్టికి నేనట్టివాఁడనే యగుదునుగాక. నీ శాపము నాకు వరమేయైనది. ఏ మంటివి ? నేను కృతఘ్నుఁడనా ? పడఁతీ, చూడుము నావంక ! కృతఘ్నతయా ? (తేఱి పాఱఁజూచును.)

భువన:—ఆహా, అద్భుతము! అమానుష తేజము! దుర్నిరీక్ష్యము,... బ్రహ్మతేజో బలము - చూడఁజాల-చూడఁజాల!

(నిష్క్రమించును)

పరశు:—అబ్బ! పరమేశ్వరుని యనుగ్రహమున బ్రతికి బైటపడితిని.... అప్పుడే యరుణోదయమైనది.

మ॥ ఘన సంక్షోభము లోపటిల్లెఁ, గమల
వ్యూహంబు కాంతిల్లెఁ బు
ష్పాదిరేఁగెన్ విమలప్రభాత పవనం
బుల్ సాగుటన్-గల్వపూఁ
బడఁతుల్ మోము ముడించి రెల్లెడల-ది
గ్భామల్ ప్రసన్నాస్యలై
కనంగా రాముస లోకబాంధవుని రా
కన్ గోరుచున్నారిటన్.

యుద్ధమునకు సంసిద్ధుఁడను గావలయుఁగదా, కాల్యకరణీయములు నిర్వర్తింపఁబోయెద.

(ప్రవేశము కుమారస్వామి)

పరశు:—ఎవరు, నా ప్రాణసఖుఁడు షణ్ముఖుఁడా? - నా దృష్టి నన్ను మోసగించుచున్నదా యేమి? ... ఏమి నా భాగ్యము! ఎంత యదృష్టము!

కుమార:—పరశురామా, మాతండ్రిగారివలన నీ వృత్తాంతము విన్నాఁడను. నినుఁజూడవచ్చితిని, మెచ్చితిని. నీ మహిమ నేనెఱుఁగనిదికాదు. (కౌఁగిలించుకొనును)

పరశు:—మిత్త్రవాత్సల్యమున నీ విట్లనుచున్నావు.

# ప్రచండ భార్గవము

## పంచమాంకము-ప్రథమరంగము

[స్థలకము - మాహిష్మతీ నగరపరిసర రణరంగము - ప్రవేశము - ఖడ్గహస్తుఁడగు కార్తవీర్యార్జునుఁడు.]

కార్త:— సందేహములేదు. అవతారపురుషుఁడే! నన్ను సంహరించుటకు భగవంతుఁ డిట్లవతరించినాఁడు. ఇంత విక్రమవిభూతి మనుష్యమాత్రుల కుండుట కల్ల. ఇట్టి జితేంద్రియులు జగత్తునలేరు. పట్టమహిషీవిహితోక్తులు పాటింపక పోతినిగదా, పెడచెవిం బెట్టితినిగదా! మూర్ఖుఁడను - దైవోపహతుఁడను.

శ్రీమహావిష్ణువు పరశురాముఁడై నన్ను శిక్షింపవచ్చినాఁడు. ఇప్పుడు వెనుకంజ వేయుటయా? నాకు మరణభయమా? ఛీ, ఛీ! ఇది నా యదృష్టమే! మహాభాగ్యమే. ఆ భగవంతుని దివ్యతేజస్సులో లీనమైపోయెదఁగాక!

మ॥ గెలువన్ నేరనుగాని, నా సమరభం
గిన్ జూచి భర్గుండె బె
గ్గిలఁగా వీరవిహారపారగుఁడనై
క్రీడించెదన్, నాదు కో
ర్కెలు నిండారఁ బ్రచండభార్గవసము
ద్రేకప్రతాపార్కమం
డలమార్గంబున నిర్గమించెద, వికుం
ఠద్వారముల్ జేరెదన్!

(సరభసముగా నిష్క్రమించును - తెర వ్రాలును)

# ప్రచండ భార్గవము

## పంచమాంకము - ద్వితీయ రంగము

[స్థలకము - రణరంగము. వీరపురుష వేషములతో సాయుధలగు మనోరమా చంద్రరేఖలు ప్రవేశము.]

చంద్రరేఖ:—అమ్మా,

మనో:—(రహస్యముగా) 'అమ్మా' యనకుము.

చంద్ర:—రమాకాంతా, చూచితివా ? మనసైన్యమెంత నశించినదో, త్రిపుర సంహారమొనర్చు మృత్యుంజయుఁడా యేమి యీ పరశు రాముఁడు ?

మనో:—అటు మాడుము కనబడుచున్నదా ? అదిగో అటు !

చంద్ర:—రాజమార్తాండుని వీరవిహారముగదా, కానవచ్చుచున్నది. అద్భుతముగానున్నది. ...ఆ, ఆ, భటులారా, వలదు పరుగెత్త వలదు.

మనో:—రమ్ము రమ్ము - ఆవైపున కేగుదము. భటుల కుత్సాహము గల్పింతము.

(నిష్క్రమింతురు)

(వేఱొక దిశనుండి యిరువురును పునః ప్రవేశము)

మనోరమ:—పోరుఁడు, ధైర్యము వీడకుఁడు.

కం॥ గెలిచినచోఁ గీర్తిరమా
కిలికించితముల్ లభించు, గెలువక పోరన్
బొలిసినచోఁ, ముక్తిసతీ
లలిత పరీరంభ దివ్యలాభం బొదవున్ !

వెనుకంజ వేయుచున్నారా? వలదు వలదు.

కం॥ మీకండలు పెరిఁగెను భూ
మీకాంతుని కొలువునందె, మెయిపయినాసఁ
గైకొని యరమర పోరునఁ
బోకార్పకుఁడయ్యె కీర్తి పోటరులారా!

నడువుఁడు. విజృంభింపుఁడు....

చెలికాఁడా, నీ వీవంక కేగి రమ్ము. నే నా కోటకొమ్మునకుఁ బోయివచ్చెద.

(నిష్క్రమింతురు - తెర వ్రాలును)

---

# ప్రచండ భార్గవము

## పంచమాంకము - తృతీయరంగము

[స్థలము - రణరంగమున నొక ప్రదేశము - త్వరిత గమనముతో నెడమకంటికడఁ దగిలిన గాయమునుండి వచ్చు రక్తము నొక హస్తముతో నాపుచు యోధరూపముననున్న మనోరమ దుముకును.]

మనో:—అబ్బ,...ఈ దెబ్బ నాకెట్లు తగిలెను? శర మేవైపునుండి వచ్చెను? ఎంత నిరోధించినను రక్తము నిలువదేమి? (తనయంగి చించి గాయమునకుఁ గట్టుకట్టును. ఒడలెల్లెడఁ బరామర్శించుకొనును) - తాపము ! దాహము ! (నేల వ్రాలును.)

(ప్రవేశము చంద్రరేఖ.)

చంద్ర:—(ఆవేగముతో) అయ్యయ్యో, (కట్టు సవరించి) ఏమిది?

(మనోరమ కన్నులు తెఱచును.)

మనో:—వచ్చితివా, యుద్ధ మెట్లున్నది?

చంద్ర:—చక్రవర్తికిని బరశురామునికిని ద్వంద్వయుద్ధము జరుగుచున్నది.

మనో:—ఔరా, ప్రభు వేకాకియై పోరుచున్నాఁడా?...క్రొత్తకవచ మొకటి తేఁగలవా?

చంద్ర:—తప్పక. ఇదే పోయి తెచ్చెద...

[ఇరువురు నిష్క్రమింతురు - తెర వ్రాలును.]

---

# ప్రచండ భార్గవము

## పంచమాంకము - తురీయ రంగము

[స్థలకము - రణరంగమున మఱియొక ప్రదేశము - కార్తవీర్యుని శరీరము విగతశీర్షమై పడియుండును. ప్రవేశము మనోరమ.]

మనోరమ:—(నలుకెలంకులం జూచి) మహాభయంకరమై యున్న దీ సంగ్రామ భూమి. బీభత్సరసాధిదేవత కిట్టి ప్రదేశములే కాంబోలు విహారరంగములు !

చూర్ణములైన కవచములు, విధ్వస్తములైన రథపంక్తులు, భగ్నములైన తురంగసంఘములు. అహా! యెంత వినాశము, ఎంత రక్తపాతము ? ఎందుకోయిది ?

ఈ వైపునం గదా చక్రవర్తికిని భార్గవునికిని ద్వంద్వయుద్ధము జరుగుచున్నదని వింటిని. ఈ ప్రదేశము నిర్జనమైయున్నదే ! (రెండడుగులువైచి) అయ్యో, ఎవ్వరిదీ శరీరము? (సమీపించి, చూచి, పరిశీలించి, స్పృశించి) హా! (మూర్ఛిల్లును).

(మూర్ఛనుండి తేఱి) అయ్యో! వలదన్న వినకపోయితిరి గదా, ఆ మాయలమారి యావు మీపాలిటి మృత్యుదేవత యయ్యెనా ?...... దత్తాత్రేయమహర్షీ, నీ వరము లమోఘములని యువ్విళ్లూరితిమే !... అణిమాదిసిద్ధులారా, మీరైన బ్రతికించుకొనలేక పోయితిరా ప్రభువును? ...జమదగ్నీ, విప్రుండవుగదా నీ కిట్టి కుమారుండేల జన్మించెనయ్యా ? రేణుకా, నిట్టనిలువున నీ తనయునిచేత నా మనోహరుని వధింపం జేసితివా? పతిప్రాణనగు నేను నా పతి ప్రాణములకై యెట్లు పలవరించుచున్నానో యట్లే నీవును నీ జీవితేశ్వరుని జీవములకై యొక సారికాదు గదా ముయ్యేడుమార్లు వాపోవుదువు లెమ్ము. నావిభుని మస్తకము నీకొడుకెట్లు ఖండించెనో, యట్లే నీ శిరమును, నీ బిడ్డల శిరంబులును నిర్దయుండై యతండు తెగవేయునుగాక!......అహా, యేమి యీ తాపము, ఏమి యీ గాయపు బాధ, దుర్భరము, ప్రాణేశ్వరా, నీ సన్నిధానమున కిదే వచ్చుచున్నాను. అమ్మా, కాత్యాయనీ,...(పడిపోవును - తెరవ్రాలును).

# ప్రచండ భార్గవము

## పంచమాంకము - పంచమ రంగము

[స్థలకము - అరణ్యము - హోమధేనువును నడిపించుకొనుచుఁ బరశురాముఁడు ప్రవేశము.]

పరశురాముఁడు:—అతనిం గడతేర్చి, దీనిం గొని వచ్చుటకై యెంత ప్రయాసపడవలసి వచ్చెను?

(ఆవు నుద్దేశించి) అమ్మా, గో దేవతా, ఎంత పరితపించితివో యేమో! నరక నిలయములగు నరేంద్రుల మందిరాంగణముల మనవలసిన దుర్గతి చేకూరెనని దురపిల్లితివా? శర్వునికడ నే నలవఱుచుకొన్న సంగ్రామ కౌశలమెల్ల శ్మశానము పాలై పోయెఁ గాఁబోలునని నిరాశ చేసికొంటివా? హోమాది నిత్యకర్మానుష్ఠానమునకు వలసిన ద్రవ్యసంపత్తి సంకల్పమాత్రమున సమకూర్పఁ గలిగిన నిన్ను రక్షించుకొననేరని బైరాగులతో సంగాతి మీ గతికిఁ దెచ్చెఁగదా యని యంగలార్చితివా? గోరక్షణ మొనర్చుకొనలేని యంబేద లాచరించు జపతపో వ్యాసంగములు భస్మ హావ్యము లగునని శపించితివా ?

హీనమానవుల బారినుండి ధేనువులఁ దప్పింపలేని దీనులకు స్వారాజ్య సంసిద్ధి యెక్కడిది? పాతకుల వాతనుండి గోవుల రక్షింపఁ బ్రాణముల నొడ్డి, వచ్చిన నెత్తురులు ప్రవాహములుగాఁ బాఱించుటకైన సంసిద్ధము కావలసిన భారతజాతి యేనాఁడు వెనుకంజవేయునో, యేనాఁడు తూష్ణింభావము వహించునో యానాఁడే యయ్యది సంక్షయము నొందును గాక !

మ॥ నుతికెక్కెన్ భరతోర్వి నీవలన, నిన్నుంబూజగావించుటన్
బ్రతుకంగల్గెను శ్రౌతధర్మములిటన్: వర్ధిల్లుమో తల్లి, భా
రతభాగ్యావహకల్పవల్లి, పరమార్థ ప్రాపకంబైన మా
మతమే తాలిచెఁదావకాకృతి జగన్మాతా, నమోవాకముల్!

ఉ॥ నా తరమే నుతింప నిపుణమ్ముగ నీగుణముల్! పయోధరీ
భూతచతుస్సముద్రవు-విభూతివిశిష్టవు-ధేనురూపధా
త్రీతరుణీమతల్లి, యొనరించెద నీకుఁ బ్రదక్షిణంబు: నా
పాతకముల్ శమించుత దివాకరదీప్తిఁ దమమ్ములుంబలెన్.

మ॥ సతముం గోవులఁ గొల్చుచున్ సురభిహిం
సాపాతకారంభులన్
హతమార్పన్ వ్రతదీక్ష గైకొనిన, హిం
ద్వార్యౌఘ మద్దాన శా
శ్వతసంపూజ్యత గాంచుతన్! సకల శో
భాలాభ గేహమ్ము భా
రతవర్షమ్ము సమస్తదేశమకుట
ప్రాయమ్ముగుం గావుతన్!

ఔరా, యీకార్తవీర్యుఁ డెంత పరాక్రమశాలి! ఎంత విక్రమ ధురంధరులైనను జక్రవర్తులు, నిరపరాధులగు సాధువులను, బ్రపంచానుషంగమొల్లని మునిజనులను గాఱించుటేమి న్యాయ్యము? దురహంకారుల కిట్టి శాస్తి కావలసినదే.

గీ: సాధుసంయమి గోవిప్ర సమితియెడలఁ
బుడమిఁ జేసేత కావింపఁబడినకీడు
కర్తను హరింపగల్గుటే కాదు సుమ్ము,
సల్పు తప్పక వాని వంశక్షయమ్ము!

ఈ మా యావును గొంపోయి నా జననీజనకులకును సోదరులకును సమ్మోదముం గూర్చెదఁగాక!

(నిష్క్రమించును - తెరవ్రాలును)

---

# ప్రచండ భార్గవము

## పంచమాంకము - షష్ఠ రంగము

[స్థలము - జమదగ్నియాశ్రమము - ప్రవేశము జమదగ్ని.]

జమదగ్ని:—అల్లవే యరుణరేఖలు!

ఉ॥ వికచసరోజగర్భములు వెల్వడి బంభరముల్ పొనర్చు గీ
తికల కలస్వనంబది శ్రుతిస్వరవైఖరి నింపొనర్చ, న
వ్యకుసుమసారసౌరభసమన్విత మంథరగంధవాహముల్
ప్రకృతిని మేలుకొల్పఁగఁ బ్రభాతముతోఁ జెమనోహరాకృతిన్

స్నానార్థమై నది కేగదఁగాక,......రేణుక నేఁటేల యింకను నిదురించుచున్నది?...(పరిక్రమించి) రేణుకా, ఏమి నీ వింకను నిదురించుచున్నావు?...(పరిశీలించి) నిదురించుట లేదు. ఏమిది? వెక్కి వెక్కి యేడ్చుచున్నావు రేణుకా?

రేణుక (గాద్గద్యముతో) ఒంటరిగాఁ బోయిన మన రాముఁడు...

జమదగ్ని:—ఓహో, యిదియా నీ విచారము? లెమ్ము, లెమ్ము.

శా॥ ధానుష్కాగ్రసరుండు విక్రమకళాదక్షుండు త్రైలోక్యర
క్షానిర్నిద్ర భుజార్గళుండు నిటలాక్షు ప్రాప్త దివ్యాస్త్రవి
ద్యానిష్ణాతుఁ డతంద్రిలుండు నిరవద్యబ్రహ్మతేజోఘనుం
డౌ నీరామునకా భయంపడెద వేలా బేలవై యీగతిన్?

(శిష్యుఁడు గాలవుఁడు ప్రవేశించును)

గాలవుఁడు:—గురుదేవా, మన పరశురాముఁడు హోమధేనువుతో వచ్చుచున్నాఁడు. రేణుక (ఉత్సుకయై) పరశురాముఁడా, యేఁడీ,

యేఁడీ, ఎంత దూరమున నున్నాఁడు? నిజమా, గాలవా, నాయనా? ఎవరు చెప్పిరి?

గాలవుఁడు:— నేఁ జూచితినమ్మా, అదే, వచ్చుచున్నాఁడు.

[పరశురాముఁడు ధేనువుతోఁ బ్రవేశించును. వెంట రుమణ్వత్సుషేణ వసు విశ్వావసు శాలిహోత్రులు ప్రవేశింతురు - రేణుక పరశురాముని ఆనందాశ్రువులతో గాఢాలింగన మొనర్చుకొనును-పరశురాముఁడు తలిదండ్రులకు సాష్టాంగ నమస్కార మాచరించును.]

జమదగ్ని:—నా ప్రాణతుల్యమైన యీ హోమధేనువుం గొని మరలి వచ్చితివి. కుమారా, చిరంజీవివై వర్ధిల్లుము. నీకేమి కావలయును?

జమదగ్ని:—తండ్రీ మీ యాశీర్వాద బలమున్న నాకింకేమి కావలయును?

జమదగ్ని:—అయిన నిది యగుంగాక.

(భరత వాక్యము)

మ॥ శివునిం బోలెను శిష్యవత్సలత వాసింగాంత్రుగాకొజ్జై, లు
ర్వ్విభుల్ గర్వముమాని సాధువులఁ బేర్మిం బ్రోచెదగ్గాత, స
త్కవివాగ్గుంభన లీసుమాని సరసుల్ గైకొంద్రుగా కార్యధా
త్రి విచిత్రోరుర మాసవిత్రి యగుచుర్ దీపించెడుం గావుతర్.



Printed at the B. N. K. Press, Madras—Q. H. No. Ms. 100/B.
For Q. H. No. 35/D — 1000—3-46.

7. అమృత కలశము (శ్రీకృష్ణ — పాదకము) వెల 0-8-0

"శ్రీరామకృష్ణయ్యగారు వెన్నదొంగను కన్నులలో మెదలించుకొను కమ్మటికవులు. మురళీకృష్ణయ్యపై కవితయున్న ఒక వెన్నెలరాత్రి - ఒక అమృత నిర్ఝరిణి యని వేఱుగా చెప్పనక్కఱలేదు గదా! రామకృష్ణయ్యగారును ఆ గోపాల బాలునిలో లీనమై భారతకృష్ణుని ప్రస్తుతించి, గీతాకృష్ణునికి కేలుమోడ్చి యర్చించినారీ గ్రంథంలో - హృద్యమగు కవిత - ఉత్సాహవంతమైన నడక:
మచ్చునకొక పద్యము చూపుదునా?

గీ॥ మోవి మురళి మ్రోయు, మూపు చిక్కము మోయుఁ,
జెంచు కురుల నెమిలి పించె మలర,
నవ్వు మోముతోడ, నాచిత్త ముకురాన
నొడిగి ప్రతిఫలింపు మోయి కృష్ణ!!

—కృష్ణా పత్రిక.

8. ప్రేమ లీల (శ్రీ మామిడిపూడి - రామకృష్ణయ్య, మోచర్ల - రామకృష్ణయ్య కలసి రచించిన పౌరాణిక నాటకము) ,, 0-12-0

"ప్రేమలీల చేదివితిని. రసవంతముగా నున్నది.... కరుణరస ఘట్టముల - కొన్నిసందర్భముల కన్నీరు గార్చితిని - ముద్దుగా వ్రాసియున్నారు."—

T. Raghava, Bellary.

9. ఛత్రపతి శివాజి. (అముద్రిత నాటకము)

*For copies apply to:—*

మోచర్ల రామకృష్ణయ్య, [illegible]
ఆత్రితోట అగ్రహారము, నెల్లూరు.